# తొలిపలుకు

హిందీభాషయందు నాటకరచనమున సందడిసేసిన శ్రీయుత ద్విజేంద్రలాలరాయని "పాషాణి లేక యహల్య" అను కృతికి యాంధ్రానువాదము. వీనులవిందై యమృతము పోసినట్లై పాఠకలోకమునకేకాక నాటకలోకమునకు నమితానందము నొందించుచున్నది. కృతిరచయితలు గద్యపద్యములు రెండింటి యందును, వైపువాటము తెలిసిన యనన్యసాధారణులు. పాత్రోచితభాష వాడబడుట నీనాటకమునకు జీవత్వమును గూర్చుచున్నది. ఇదియనువాదమైనను స్వతంత్రరచనమునట్ల లరారుచున్నది. గ్రంథకర్తలు నాటకరచనము నందారితేరినట్లీ నాటకము సాక్ష్యమొసగుచున్నది. వారు లౌకికోద్యోగమున నిట్టిరచనల కవకాశములేని సంస్థలలోనుండియు నీరీతి భారతీ సేవయు నాట్యభారతీసేవ సేయుట మిక్కిలి ప్రశంసనీయమగు విషయము. ఇట్టి చక్కని రచనా సాంప్రదాయముగల నాటకములను నాటకకళాపరిషత్తువారును, చలనచిత్రసంస్థా ప్రతిష్ఠాపకులును విద్యాశాఖవారు నాదరింతురు గాత!

2 ఆలంగతపిళ్ళవీధి
సర్వధారిపుష్య శు ౧౨
సోమవారము

విద్యారత్న శాస్త్రోపాధ్యాయ
నిడుదవోలు వేంకటరావు,
ఆంధ్రోపన్యాసకుడు
మదరాసు విశ్వవిద్యాలయము,

# పరిచయము.

ఆదికవి రామాయణ కావ్యమున 'అహల్యాచరిత్ర' చిత్రణమందు అనుశ్రుతముగా వచ్చుచుండిన భాస్కరాదుల యితర రామాయణములందు ఆమె శీలాదిగుణములగూర్చిన గాఢాభిప్రాయమునకు భిన్నతకనుపించి నన్నాకర్షించింది. ఆదికవి వ్రాసిన నగ్నసత్యాన్ని మరుగుపరచి గుణబోధనమే కావ్యలక్షణంగా చూపించాలన్న కాంక్ష ఎందుకో బోధపడదు. నిజంగా విపరీతంగా కనపడ్డా నగ్నసత్యం ప్రజాదృష్టికి తేదలచి సాధ్యమైనంత హితవుగా సున్నితపద్ధతి ననుసరించేను. తక్కినవిషయాలు పద్మపురాణంలో చెప్పబడ్డ "గచ్ఛత స్తస్య రామస్య. .........సమాక్రాంతా మహాశిలామ్" అనేదానికినీ, ఆధారంగా ఎత్తిచూపబడ్డ వాల్మీకిపాఠానికిన్నీ దూరం కాకుండా కాలానుగుణ్యంగా సంభవసాధ్యంగా ఉన్నంతవరకు చూపడానికి చేసినప్రయత్నం ఎంతవరకు సాధ్యమైయిందీ నిర్ణయించేందుకు పాఠకులకీ దర్శకులకీ విడిచిపెడుతున్నా—

వంగనాటకకర్తలలో ప్రథమశ్రేణిలో లెక్కింపబడ్డ ద్విజేంద్రలాల్ రాయుని హిందీపాఠానికి గౌతముని సత్వగుణోజ్వలత, సహనముయొక్క మహత్తరపరిణామము, స్త్రీతత్వమందలి సహజచాంచల్యము, అనుకరించేనేగాని ముక్కకి ముక్క అనువాదం విడుచుటలో నాస్వేచ్ఛనే చూపదలచాను. యిందుకు సావకాశంగా విని ఆమోదించి అమూల్యమైన సలహాల నిచ్చిన కీ. శే. మౌ. వుమరాలీషాకవి పేరుతలుచుకోడం నాకృతజ్ఞతకు కనీసవిధిగా భావిస్తున్నా.

నా యీ రచనకు ప్రచురణకు తొలినుండీ ప్రోత్సాహం, దోహదం, సహాయంచేస్తూ వచ్చిన మిత్రుడు నాటకరచనాభినయప్రాజ్ఞుడు చిరంజీవి శ్రీ జరుగుమిల్లి బాలకృష్ణశాస్త్రి పేరుకూడా పాఠకలోకానికి పరిచయం చేయకుండడం తప్పు అన్నవిధిగా ఎంచేను.

విరోధి సంక్రాంతి
14—1—1950

ఇట్లు
జీవనశర్మ.

# పాషాణి

## అను:

## అహల్య

ద్విజేంద్రుని హిందీ

పాఠమునకు

స్వేచ్ఛానువాదము

గన్నిగేయ పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| గౌతమ | అహల్య |
| జనక | మాధురి |
| విశ్వామిత్ర | ఇంకో గుంపు |
| శతానంద | |
| దేవేంద్ర | |
| రామ | |
| లక్ష్మణ | |
| చిరంజీవులు | |

ఆ ధా ర ము :

మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన
మతించకార దుర్మేధా దేవరాజకుతూహలాత్
అథాబ్రవీత్సురశ్రేష్ఠం కృతార్థేనాన్తరాత్మనా
కృతార్థోస్మి సురశ్రేష్ఠ గచ్ఛశీఘ్రమితః ప్రభో
ఆత్మానం మాంచ దేవేశ సర్వథారక్ష గౌతమాత్
ఇన్ద్రస్తు ప్రహసన్వాక్య మహల్యామిదమబ్రవీత్
సుశ్రోణీ పరితుష్టోస్మి గమిష్యామి యథాగతమ్.

శ్రీ వాల్మీకి రామాయణే బాలకాండః ౪౮-సర్గ.

ఓం

శ్రీ మాతృదేవ్యైనమః

# పా షా ణి

ప్రథమాంకము—ఒకటవ రంగము.

జనకుని యాస్థానము. జనకుఁడు, విశ్వామిత్రుఁడును ఆసీనులై.

విశ్వా—రాజేంద్రా! ఇంతేకదా బ్రాహ్మణత్వము. ఆజాతికి మాత్రమునకే యింత తెగనీలుగా! యాసాలాభముగ కొంచెపాటి తపస్సుచేసిన చాలును. నేను పొందియుండ లేదా? ఇది సంపాదించుట యెంతసులభమో భ్రష్ట మగుటకును అంతే—కేవలము శలభము—చిన్న చిటుకతో తుప్పున నెగిరిపోవును.

జన—విశ్వామిత్రా, చాలు నీయభిమానము. అహంకార పడకు.

గీ. బంధువర నివృపిందన ♦ బ్రహ్మపదము
మిగులశ్రమపడి శక్తి స ♦ మీకరించి
యందినది కాన నాసత్వ ♦ మస్థిరంబు
సహజసంపద్విభూతికి ♦ సాటిగాదు.

వారి యర్హత మనకంత చేరువైనదిగాదు. చాల యంతర మున్నది.

విశ్వా—ఆఁ- అనన్యసామాన్యమైన నాశక్తి యస్థిరమా! ఒకరు కాదు. యెల్లరును అంగీకరించిన దే నాబ్రహ్మపదము! అవసరముపట్ల నాస్రష్టకు ప్రతిసృష్టి కాగింతును. ఇక జాతివిషయిక ప్రసక్తియన్న నది సామాన్య గాధ విషయము. ఇంతకును మీానికూర్పునకి ప్రమాణము?

జన—ప్రమాణమా - అదిగో - ఆనది చూవలిపొన్న నకుటీర మున్నది. అచటి కొక్క-సారిపోయిన నీ యడిగినప్రమాణము లభించును.

విశ్వా—గౌతమాశ్రమమా? (నవ్వి) ఏమి? నాపదమాసాటికి సరిరాదా?

జన—ఆహా సరిరాక పోవుటయే కాదు. అసాధ్యమనియే. ఏ మంతనం చేహాము? నీకన్నులార నీవే చూడగలవు.

విశ్వా—ఆఁ అతడును ఋషియే-గృహస్థు-అతిలోక సౌందర్య రాసి అహల్య అతనిసతి.

చ. సడలినయీాడు ఆలి యెలజవ్వనరూప సుధాస్రవంతియీా
వడిగృహమేధి యద్వయతపః ప్రతిభాపరిపాటిమాటవే
రడుగన దేల? ఇంతకిపుడానని కాదనివాద మేల? నే
కడగిపరీక్షచేయుదల గౌతమబ్రహ్మపదం బడెట్టినో.

జన—ఈ అహమిక యే లేకున్న ననన్యుడే. కాని యేమి లాభము?

విశ్వా—(కొంతనడచి) రాజేంద్రా నరే మీాకె కనుపించెద నుగా. ఓహో యెంతటి యతీతునిగానున్నది వీరి యూహా! పరమేష్టికన్న పరమనైష్ఠికుడా - శంకరుని కన్న సంకల్పరహితుడా. యిప్పుడేపోయి యత్నించెదను. నాడు స్వయంవరమున సురపతి చూచి మురిసిన తెరవయేకదా. ఆ గౌతమునియుక్తి నాడు వేదమాన్యమైనది. కాని యాతని బిరుసు గడ్డమును, విరస ప్రకృత్తియు, నాముద్దరాలియెడ నాడు చిత్రింపబడిన దేవేంద్రుని సోయగము మాయనీయక గురుతు కొల్పు చుండునుగదా! నేనె లోభన గొల్పి చూచెదను. ఆపె హద్దు రద్దుసేయుట పెద్దపనిగాదు.

తెరపడును. (నిష్క్రమించును.)

---

ప్రథమాంకము—రెండవ రంగము.

---

గౌతముని యాశ్రమోపాంతమున తాపసబాలురతో నాడుచు చిరంజీవి ప్రవేశము.

చిరం—ఇక్కడెవళ్ళెవళ్ళున్నారర్రా?

బాలురు—అందరంవున్నావండి.

చిరం—అబ్బాయిందరెందుకు పొండ్రా. (వాకు పోవుచుండ)
ఆగర్రోయ్. మిమ్మల్ని ఒకాటి అడగాలి. చూడండి.

బాలురు—ఏమిటండి?

చిరం—ఒకే కదిలితే పడిపోయానా— పడిలేక పోయానా— చెప్పండి?

బాలురు—పుట్టినందే హామేనండోయి. గురువుగారి నడిగి లేక
పోయారూ?

చిరం—అడక్కేం అడిగేను. కాని ఊరుకున్నారు.

బాలురు—ఐతేమీగూ సందేహంకూడా అంతేనేంటి!

చిరం—అహా - ఊరుకున్నా నా. బాగా తలగోక్కొని ఆలో
చించేసరికి ఒకాలా తేలిపోయింది. కాని మీాకు చెబు
దామంటే యేంబోధపడాలా గోమవా!

బాలురు—చెప్పండి. బోధపడుతుంది.

చిరం—యేంబోధపడిందయ్యా అంటే. (గానము తీయుచు
కన్నులు త్రిప్పుచు) ఆ—

అంతాశూన్యమురా ఈ జగమంతా శూన్యమురా
ఎంతలేసి వారెరుగుదుమన్నా—యెరిగినదందర మెరిగిన దేరా॥అం॥
మెరుగులునమ్మకురా పై పై మెరుగులు నమ్మకురా
మెరుగుల మోసపుమరుగులలోనీ - గురుతుమరచి పామరతబడి
చెడకు ॥అం॥
ఆసలపోకలురా మనబ్రతుకులు - మోసపుకాసులురా
లేశమేని పసిలేని కపటనట—వేసముదీసినమీాదట మిగులునే ॥ఆ॥
రూపులెభేదమురా యీాతనువుల చూపులెభేసమురా

ఊపిరియుడిగిన మాపటివేళను - ఏపూ రూపూ సాపూ తీపూ అంతా శూన్యమురా.

(విశ్వామిత్రుడు ప్రవేశించును. బాలురు పారిపోవుదురు.)

విశ్వా—గౌతముల తపోవనమిదియేనా!

చిరం—(ఎగాదిగా విశ్వామిత్రుని పరికించి) తమకెలా బోధపడుతూంది?

విశ్వా—ఇది మహర్షియాశ్రమమేనా?

చిరం—ఊఁ. కాకపోతే కల్లుపాకలా కనబడుతూందా!

విశ్వా—ఏమా వికటము? సమాధానముగా జవాబీయలేవా!

చిరం—ఆ. యివ్వకపోతే యేం.

విశ్వా—గౌతములవారున్నారా? అని అడిగితే యీ వికటమేమి?

చిరం—వారి పరీక్షయెందుకండి? చిట్టడివేట చిత్తగిస్తున్నారు.

విశ్వా—అరెరే మాటలపోగులాగున్నావే!

చిరం—తమరెవరండి- మొదట.

విశ్వా—మొదట! ఊఁ- నేను విశ్వామిత్రమహర్షిని. నీవెవరు!

చిరం—అట్లాగా- ఐతే- నేనూ- చిరంజీవిశర్మర్షిని.

విశ్వా—శర్మర్షి- అర్థమిటి?

చిరం—అంటే మనకి మొదట్లో మహార్షిరోగముండేదిలెండి. ఇప్పుడది ముదిరిపోయి వర్ణంకూడా మారిపోయింది.

విశ్వా—ఏరా! మూర్ఖా నాకోపము రేగుచున్నది. గుర్తెరింగి మసలుకో—

చిరం—చిత్తం చిత్తం. ఏవోతఘోచితంగానే—

విశ్వా—నే నెవరో అగుపడుచున్నదా?

చిరం—ఓ అగుపడకేం. జోడులేదు.

కాయం నవకార్తికేయం ఆననం మదనమోహనమ్
శరీరం వర్తులాకారం మస్తకమ్ మధ్యవస్తులం
కాలాంజన సమంకాన్తి దాడీతో దాడిసూచితం
ఘోరం దుర్భరమాకారం క్రాంతి కర్మసమారభే.

విశ్వా—ఇకసహించను. కోపానలముతో భస్మమైపోవుదువు గాక కాచుకో—

చిరం—ఓహోహో కానీండి కానీండి. గాడిద వేదుస్తున్నాయి బూడిదలేక.

విశ్వా—(కమండలువులోని నీరుచేత బోసుకొని అభిమంత్రించుచు యిటునటు తిరుగుచు) ఓం - హ్రాం - హ్రీం - హ్రూం - హ్రైం - హ్రాం.

చిరం—(కనులు మూస్కొని) ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం గోష్పదీకృతవారాసీం. శ్రీ ఆంజనేయం ప్రసన్నాంభ జేహం గాలిదెయ్యంబులన్ పీడసన్యాసులన్.

విశ్వా—ఏరామూర్ఖా ఆంజనేయదండక మెందుకురా?

చిరం—చిత్తం చిత్తం. పీడాపిశాచం సోకకుండావుంటుందని.

విశ్వా—భూతములను పిలుస్తున్నాననియా నీయూహా!

చిరం—కాకపోతే. ఆశీర్వచనప్పనసలు సెలవిస్తున్నారా!

విశ్వా—(చిరంజీవి మెడబట్టి గెంటుచు) వట్టి మూర్ఖపుపశువు.
చిరం—(పెదవి విరచుచు) ఎబ్బె వట్టి ఉడుకుబోతుఘటం.

గౌతముడు ప్రవేశం.

గౌత—చిరంజీవా ఏమది! యెవరితో నావాదము?
చిరం—(తొట్రుపడుచు) లేలేలేదండి. ఏరెవీరెరెవరో వస్తే పపప్పరీక్షిస్తున్నా.
గౌత—మహాత్మా తమ పరిచయభాగ్యమున కీయల్పుడర్హుడా?
విశ్వా—ఎవరిది? యెంతవినయము? నన్ను విశ్వామిత్రుడందురు.
చిరం—మహాబ్రహ్మర్షులుకూడా నటండి.
గౌత—ధన్యోస్మి. అగును చిరంజీవా ఈమహానుభావుల యెదుట నేను కీటానుకీటమును. నీవు చాల అవిధేయతగా ప్రవర్తించితివి. క్షమాభిక్ష వేడుకొనుము.
చిరం—ఓహో క్షమాభిక్ష ఒహటుందీ. (విశ్వావిత్రుని చుట్టు తిరిగి వీపుపై తట్టి) అయ్యా శాంతించండి. వీరే మా గురువులు. మూడుకొమ్ములున్నాయి.
విశ్వా—మీారేనా గౌతములు?
గౌత—చిత్తము. వీడునాశిష్యుడు. అవజ్ఞుడు. వీనిదుడుకు మన్నించెదరుగాక. సావకాశముగ వీనిచరిత్ర మనవి చేయుదును. ఆశ్రమములోనికి రండు. (పరిభ్రమించుచు) నేడుమహాసుదినము. మహాత్ముల దర్శనమైనది.

(నిష్క్రమింతురు.)

విశ్వా—ఏమీతని వినయసంపత్తి! ఆ సాత్త్వికరసప్రభావమును యీ ఆశ్రమవాతావరణమును నాయహమిక నొకింత జోకొట్టుచున్నదే! పొరపడలేదుగదా. సరే ఇంకను పరీక్షించెదను. (నిష్క్రమించును.)

చిరం—అగ్నిహోత్రం పవిత్రమే కాని అంటితేమంట.

తెరపడును. (నిష్క్రమించును)

---

## ప్రథమాంకము—మూడవరంగము.

---

గౌతమాశ్రమోపాంతమున ఉపవనమున అహల్య పూలు నేరుచు పాడుకొనుచు ప్రవేశము.

సమధిక శోభామయీ – నవనవ సమధిక
ద్రుమదళపల్లవ సుమనసమంజుల
భ్రమరీగీతాలాపకలాపా ॥సమ॥
సాకేరాసవ సాదితమృదుమధు
కోకోనాద వినోదికోకిలా ॥సమ॥
సారసుధాపరిపూరిత నీరజ
కోరక ప్రచలిత హాళీ–పాళీ–॥సమ॥

ప్రకృతీ నీ సౌందర్యము కవులు వర్ణింతురన్నదికల్ల. తత్త్వజ్ఞులు నిర్ణయించినది తప్పటూహా. తార్కికులుకన్నది భ్రమ అనుభవజ్ఞులకుగూడ క్షణక్షణ పరివర్తనశీలవగు నిన్ను నిరూపించుటన్నది వెర్రి.

పూలసజ్జతో మాధురి (తెరలో)

అనుభవ మెఱుగని యనుపమశోభల
విరులకొసగు ప్రకృతి నిరుపమప్రీతి
నినువలె పరహిత నియమము కరుల భువి
కననౌనా రాగ ఫలత్యాగీ ॥నను॥

అదిగో మాధురి—(కలిసి)

సముచిత శోభామయీ నననన సముచిత శోభామయీ॥

మాధురి ప్రవేశము.

అహల్య—మాధురీ ఇంత ఆలస్యమైన దేమే? నీభక్తి బంగారముగానూ ఇంతవరకునూ పూజయో విశ్రాంతిగోరి ప్రాణులన్నియు సద్దణగినవి. అదెపోయెగాని ఆచల్లని మఱ్ఱినీడను కొంతసేపు కూర్చుందము. నీతో...

మాధురి—అట్లే కానిమ్ము దేవీ.

అహల్య—అట్లనూ కాదు. అప్పూజములునూ లేవు నీవు శిష్యురాలవునూ అగుదువు. నేను గురుపత్నియు యగుదును. కాని దేవీ గోపీ యనక హాయిగ సఖియని మాత్రము పిలువుము. నీకు మాపున్నెముండును. చూడు నాకు మనస్సులోని రహస్యమొకటి నీతో చెప్పుకొనవలెనని యున్నది. నామనోవ్యధ హృదయపాత్రమునిండి నిలువ చోటులేక పొంగి పొరలిపోవుచున్నది. రెండు క్షణ

మాధురి—చెప్పుమమ్మా. వినుచున.

అహల్య—అబ్బ- యేమి చెప్పను! సఖి నాపెండ్లి జరిగిన దెప్పుడో జ్ఞాపకమున్న దే!

మాధురి—(స్మృతి నభినయించి) ఐదేండ్ల క్రిందట కాదా?

అహల్య—ఔను. సరిగానే చెప్పితివి. నాడుకూడ నేటివలెనె వైశాఖపూర్ణిమ. నేనప్పటికి పండ్రెండేడుల దానను. పెండ్లియన నేదో మహోన్నతపద మబ్బిన దనుకొని మురిసిపోయితిని. ఇప్పటికి తెలిసినది. అది భ్రమ యని, కేవలము విడంబనమని, వలనంతబంధమని—

మాధురి—ఏమనుచుంటివమ్మా? భ్రమా! ఇదెక్కడి తెలివి తక్కువ. జగదేకపూజ్యుడే నీభర్త! సాక్షాత్పరమేశ్వర మూర్తియే! దయాపరిపూర్ణజ్ఞానశశి! నిజముగ భ్రమ పడలేదుగద. యీరహస్యమెఱుగక.

అహల్య—సఖి ఇటుచూడుము. ఈ నాసూక్ష్మకు - యీమనోజ్ఞ యవ్వనము - యీలావణ్యస్రోత - వ్యర్థమేకదా! ప్రేమసీ, దాపరికమేల! జీవితము రుచింపకపోవుటయే కాదు—రోతగనున్నది. ఎంతమనసునముగ నుండెనో. ఆ కడచిన బాల్యము.

సీ. ఒకనాడుపూదోట నున్నపూలెల్ల నం
డలుగట్టి మెడనిండ నలయుదాల్చి
ఒకవేళను తటాక ముకురమందీసూచు
కనియుబ్బై మరపులో కరగిపోయి

ఒకప్రొద్దుమండుటెం డకులెక్కసేయక
వనఫలంబులరాల్చు కొనిభుజించి
ఒకతరివృష్టివే ణికలతారళ్యంబు
కనుగొలంకుల బాష్పమునసె గాంచి.

గీ. హాళిగడపితి నానాటి హాయి ఇంక
ప్రతినిమేషము పాడుయవ్వననిదాఘ
వ్యగ్రవాంఛాభిశాపాన మగ్రహేతి
యాతనకు శాంతిలేదెట్టి వ్రాతఫలమొ!

ఇది తలంచినంతనే హృదయము బరువెక్కి కన్నులుచెమ్మగిల-
గొంతువోయి - దిస్సవోదును. వారు మహాత్ములే.
జ్ఞానులే - దయానిధులే - కాదనను - కాని నాబోటి
తరుణులకా ధర్మములేల, తత్వజ్ఞతలేల?——

మాధురి——పిచ్చితల్లీ యే మానెర్రి మొర్రియాలోచనలు!
గౌతమునిల్లాలివైన నీభాగ్యము విలువగట్ట యొవరు
గలరు! మింటిసూర్యుడెక్కడ? మిణుగురు బురువెక్కడ?
భ్రమపడి బేలపడితివే? అజ్ఞానమార్తాండుని చూపనే
నే దీపము తేను.

అహల్య——మాధురి-చాలును. నాదిభ్రమయే కావచ్చును.
సరియే. కాని-నీవును యేదో మహాపాపము చేసియుం
టనే నీకా పశువు.

మాధురి——(తొందరగ అహల్యనోటికి తనచే యడ్డముపెట్టి)
అహా-వలదు. వారిని నిందించకుము. నీకుమ్రొక్కి
ప్రతిమాలుదును. నాదైవమును చిన్నాడకుము.

అహల్య—ఆఁ చాలు. నీ నటన, నన్నేల యడిగెదవు? వాని లోనేసుగుణమును చూచి నీ వాతని ప్రేమించుచుం టివో ఏదీ! నామీద నొట్టుపెట్టి చెప్పుమా చూచె దను. నీ వాతని మనస్ఫూర్తిగానే ప్రేమించు చుంటివా?

మాధురి—సుగుణములను చూచి కాదనుకొనుము. వారి గుణాగుణములు మనకేల?

గీ. ప్రేమనిష్కామ సాధనా విధము పెండ్లి
ధర్మసంస్కృతిబంధము ధర్మనియతి
జరుపుటకెగాని పశుకామ్య సౌఖ్యవితతి
దేలగాదని గురుని యాదేశమమ్మ.

ఆ మేరకే నాయత్నము.

అహల్య—ఓహో!

ఉ. చాలును గండశైలములు భంగునదాటుచు క్రేళ్లువారునం
దాల స్రవంతిప్రేమయన దానిని సాధనచేసి పొందగా
బోలునె? బావిలోనిజలమున్వలె చేదకు చిక్కునమ్మనే?
ఏలవివాద? నమ్మగల దెవ్వరు లోకమునందు మాధురీ.

నీ యనునయమును, ఆశ్వాసనమునుచాలును. అదెపోవుచును. ఆశ్రమమునకు పోదమురమ్మ. ఎంత విపరీతధర్మ ప్రవచనము?

నిష్క్రమింతురు తెరపడును.)

---

# పాషాణి



## ద్వితీయాంకము—ఒకటవ రంగము.

(గౌతము నాశ్రమవాటియందు చిరంజీవి, విశ్వామిత్రుడు, ప్రవేశము.)

విశ్వా—చిరంజీవా! చాల విచిత్రముగనున్నదే నీవర్తన! నీ విచటికెట్లు చేరితివి?

చిరం—అదా స్వామీ! ఒకరోజున ఈమహర్షి జనకరాజ మందిరమునుండి బంగారు కమండలువూ, జరీశాలువా, వీనితో వస్తుంటే నానోరూరింది. అలవాటు ప్రకారం ఇప్పటికంటె అప్పుడు హస్తలాఘవం బాగుండేదేమో అట్టే అంకించుకుందుకులాగేను. కాని, ఆ వెనుక యెప్పట్నుంచున్నారో రాజభటులు అది నేనెరగను. నాచేయి వానిపై బడింది. రాజభటుల ప్రహారములు నానెత్తి[illegible]డినవి. నేక్రిందబడితిని. అంతే కళ్ళువిప్పేసరికి యితను! అయ్యో యెంతపనైంది. వీనికోసమింత పాటుపడ్డావే. అడిగితే నేనీయనా ఇదే! మాత్రము. నాయాశ్రమమునకు వచ్చిన ధనమునకేమిగాని సుఖసాధనము కొల్లగా నీయనా! అని కమండలవు చేతికిచ్చి

మిప్పటిపైన కప్పేసరికి నే నుక్కిరిబిక్కిరై పోయాను. మరిలేవనెత్తి నెత్తినిచెయ్యేసి అహోనాడెంగా చూచే సరికి ఉట్టికట్టినేకళ్ళంట నీరుగారిపోయాను. మూసు మాట లేకుండా వెంట నాశ్రమాని కొచ్చేశాను. అహో లా గుండె జాలిబడిపోయిందినాలో. ఐతే ఆడుమనసు పోలేదుగాని చలికి మునిగిపోయి యిగిరి తడపగట్టి పోయి విషం విరిగిపోయిన కొరవులా ఉండియుండాలి. ఏమంటే ఒక్కొక్కప్పుడు చిన్న నుసిలా తలెత్తుతుంది. దాంతో పాపమేంది బాపనిపీకనూకి పిండుకపోదామా అనుకుంటా కానెందుకు? పట్టి దరిద్రుడు నేమాత్రం పచ్చిలేదు. అప్పుడప్పుడు మళ్ళీ దారంట పడదామా అనుకుంటే ఈతడెదురుగా గుండెల్లో కొచ్చితప్పని చెప్పినట్లవుతుంది. మరికళ్ళకి కనపడితే యింకేముంది? పొద్దుదూరితే మంచులాగ నాలోని కస్సంతా కరిగే పోతుంది.

విశ్వా—సరే మరి యీమాధురి యెవరు?

చిరం—అదీచెప్తాను సామీ. ఇది చిత్రమన్నారే. అదివింటే విచిత్రమంటారు. మొదట నిది మిథిలానగరంలోమంచి పేరున్నవేశ్య. అంటేబోగంది. ఒకప్పుడీ మహర్షిని దోచనుపోతుంటే — సన్యాసులదగ్గర. చాలా పైసావుం టుంది. చూడండి. అందుకు తన చమత్కార జాలం పన్ని పడదామని చూచింది. కానైతే వేళావిశేషం

దాని చమత్కారమంతా రెండుపదేశమ్ముక్కలతో పరిష్కారమై పోయి నమస్కారపుసంస్కారమై అరిశ ముక్క మరిగినకుక్కలా తన వాళ్ళందరినీ వదలి వెంట బడి యీయాశ్రమమంటజేరింది. ఆ నాటిదాని చాక చక్యం అవీచూచినవాళ్ళ కిప్పటి మాదిరి పోలితికేనా రాదు. ఉండుండి ఒకనాడునన్ను వరించేసింది.

పశ్వా—ఐతే యీఘటన గురువుగారి పెండ్లికి పూర్వమను కుంటాను.

చిరం—అబ్బో! చాలాముందు.

విశ్వా—భేష్. భేష్. దొంగకు దొరసాని లంజ.

చిరం—అదేమిస్వామీ? చిన్నపిల్లలు హాస్యానికి చేసుకున్నట్లు తెలియనప్పుడేదో అయిపోతే ఇహాసరా. ఆ జన్మం అలావుండిపోతారా? ఇలాంటిది మొరక్కచేసిందల్లా తెలిసి మానుకుంటేచాలట. సాక్కను - చేతగాకను కాదు. విన్నారా అదుగో గురువుగారు వస్తున్నారు.

గౌతముడు ప్రవేశము.

గౌత—మహర్షి సత్తమా పాదసేవచేయ ననుగ్రహింతురా?

విశ్వా—(తొట్రుపడుచు) అహాఁహాఁ నాకా! పాదసేవయా వలదు. ఏమియువలదు. దాని కేమిగాని - మిత్రమా ఈ యాశ్రమ ప్రకృతి నిర్మల ప్రశాంతమేగాని యే కాంతమై పోయినదికాదా, ఐన మీకిదియే ఆహ్వాయిక మనుకొందును.

గౌత—అగును.

మ. అనఘాత్మా మనినట్లు నాదుమదికా హ్లాదమ్ము ఏకాంతకా
ననవాసాత్మకని స్తరంగ సహజానందామృతాంభోధి అం
దునసేహాయిగి తేలియాడు నిజచేతోనాక వేదోల యీ
వనభూమింగల జంతుపాదపలతా పాషాణముల్సర్వమున్
కనుపించున్ సహచర్యప్రేమమయరేఖాచిహ్నితాత్మీయతన్

విశ్వా—కావచ్చునుకాని రాచనగరు లింతకంటె రమ్యతర
ములు కావనియా?

[అహల్య ప్రవేశించును]

గౌత—మిత్రమా కావు. ఇచ్చటి ఈ అమాయిక ప్రకృతియు
ఈవనపద జీవనములునచ్చినచ్చినట్లవినచ్చవు.

విశ్వా—అహల్యాదేవీ నీకు మోవినచ్చునమ్మా?

అహల్య—పతిదేవుల యిష్టవస్తువులే నాకునచ్చును.

విశ్వా—నాకుమాత్రమది యేమోగాని రాచనగరులును వైభ
వములును నచ్చకపోవు. ఏదో నియమము లేరఫుట
కీవనచర్యగాని. నిత్యజీవితము నాకు నగళ్ళయుందే
రుచించును. ఏమన అచ్చట నూతనత్వముండును.
నూతనత్వములేని జీవితమునకు జగియుండదు.

గౌత—మహాత్మా మీ ప్రభావము నన్యసామాన్యము. నా
బోంట్లకది అసాధ్యమును అరిదియు. ఇంతకును నూతన
త్వమస్థిరమేకదా?

విశ్వా—అటుకాదు మిత్రమా. ఇచట మీరు నిరుపేదలవలె గనపడుచున్నారుగదా. ఒక పరినాతో దశరథమహారాజునొద్దకు వచ్చిన—

గౌత—అగుపడుటయేమి? నిజముగ నిరుపేదలమే. కాని దశరథునొద్ద కెందులకు?

విశ్వా—అమాయికుడా! ఎందులకా? రత్నరాసులిప్పించెదను.

గౌత—హే. ఏమి చేసుకొమ్మందువు. వానితో—

విశ్వా—

చ. సురుచిరరత్నభూషలతిసున్నితరమ్యదుకూలముల్ చవుల్
గురిసెడు షడ్రసాన్నముల కుంఠితభోగవిలాస కోశముల్
నిరతముగొల్చు సేవకులు నెయ్యులు బంధులు వేయునేల నీ
వెరుగవె ఆర్యసూక్తిసరవిన్ ధనమూల మిదంజగత్తనన్.

గౌత—(నవ్వి) నాకది వలదు మహానుభావా. యథాసంభవములైన కందమూలములు, ఈపర్వతీసరిన్నిరామయజీవనములు, గృహస్థధర్మ నిర్వాహణ కీయహల్య నాకు చాలును. ఇంతకును—

ఉ. అర్థములోభమూలమగునట్టి మహావిషమౌట నేగదా
సార్థకమయ్యె శ్రీయన విషంబను నర్థము మూఢులామహా
నర్థముగోరి మర్త్యులును నారకులై నశియించుచుంట ఆ
వ్యర్థపదార్థమేఁతలపన్ పురుషార్థికి మోక్షకాంక్షికిన్.

విశ్వా—అబ్బ. యింతమాత్రకే యింత సంతుష్టిబొందిన వికాసమున కవకాశమేలేదే.

చిరం—మరేవిటకున్నారు—

జగము మరపించేటి సౌందర్యరాసి
మనసెరిగి పరిచర్యలొనరించుదాసి
సంతుష్టికిక్షమకు సరిగజలరాసి
ఏమిలాభము సాగవెత్తులింతేసి.

కాని యింకామీారనుకొన్నట్లు—

కం. కోపిష్టి తుష్టిలేనిది
చూపోపమిజాతిశుద్ధ సోమరిపోతున్
దాపురమైనన్ గానితొ
ఓపడునిలువంగ నెంతయూర్జితుడైనన్.

దాని కేంగాని గురుపత్నినంత తీక్షణంగా నోరుదెరచుక మరీ చూస్తారెందుకయ్యా. రసగుల్లాలాగు చటాలున కడుపులోకి జారవేసుకుంటూరాదేంటి.

విశ్వా—అమ్మా! అహల్యా- యేమాశ్చర్యమమ్మా- మణిఖచితములగు బంగారునగలు దైవదత్తమగు నీసౌందర్యమున కెంతనిండు. జగదేకసుందరివగుదువు. నగల్లోనిమగువ- భజనలేనిభక్తి - తప్పుబుట్టెతివితల్లీ.

చిరం—ఓహో. స్వామీా. బోడెద్దుకు పోట్లు మప్పునట్లు లభించని యలంకారప్రస్తావన నీమె ముందర నెందుకయ్యా నారదునికి నామాలు దిద్దినట్లున్నావే.

గౌత—మిత్రమా యెండవేడిమి మిగిలి, బయలు దుస్సొత్తి పోవుచున్నది. ఆశ్రమములోనికి పోదమురండు.

(అందఱును నిష్క్రమింప తెరపడును.)

## ద్వితీయాంకము—రెండవ రంగము.

(గౌతమాశ్రమ తపోవనమున కల్లుపాయతో ప్రవేశమై)

చరం—ఓహోహో యేమి రుసోయ్. దీన్తస్సాగోయ్యా. పంటో అనుకున్నాను. కాని మాగురువుగారికీ బర్లోపోన మాతేరావు. ఈయనకి మహార్షి బిరుదిచ్చినవాడు పట్టి తాగుబోతై యుండాలి. ఈరుసియెరగనివాడు ఋషి యెలాగాతాడు! ఇదివొత్తి అపశబదం. ఈ రుసి పట్టిపలికించితేనే ఋషి అవుతాడు. మరీఒట్టిపెడితే మహాఋషి అవుతాడు. గంజాయిదాగి కర్రగట్టి పోయీవాళ్లుత్తసన్యాసులే. కళ్లెట్టితో కైలాసం బోవాలంటే యిదీరస్తా. నవ్వుతారెందుకోయి. వెర్రిమొహాలు. మూర్ఖులకేం దెలుసుముక్తితత్వం. ఈమహాయోగం చూడండి. కళ్లెట్టితో కైలాసంబోతున్నా. ఇదిగో కాళ్లు తేలిపోతున్నాయి. వొళ్ళుజోగుతోంది. ఇది విశ్వామిత్రరసం. విశేషం. అనుమానంవుంటే అడిగి తీర్చుకోండి. ఈస్తాయినుండి నవ్వుడే భూమిగుండ్రంగా తిరుగుతుందీ అని సిద్ధాంతం జేసింది. దీన్తోకష్టవాక్యానికిపెట్టీశాంచుక్క ఆహాహా! ఆః ..(రాగమునీయుచు)

చుక్కరా తలకెక్కరా గురుచుక్కరా తలకెక్కరా
ఒక్కక్షణమైనానుచాలు ప్రక్కనొక్క చుక్కయుంటె

నిక్కముగ జీవితములోనికి లెక్కరా సద్గురుప్రసాదము ॥చు॥
మాధురీ—ఓమాధురీ వేవేగ మే రావేదరీ
ఏదిమాద్రామిాదరీ—మాబావగాడి సోదరీ మాధురీ
అబ్బవుట్టి కుట్టినేవొచ్చిస్తూందే సంగీతం కవిత్వంకూడాను
అట్టిఅట్టి—అదేబ్రహ్మలోకం బ్రహ్మలోకంలో అదే
శారదే—ఓ శారదే నాసారతే మా మాధురీ॥

(తెరలో మాధురి వెనుక ప్రవేశం)

హిందూ పరిణయవిధి ఇహలోక సుఖజలధి
ఎందుందిమరి వేరే ప్రేమజలసంధి
వడిగలవయసువాగు వెడలేటివేళలో
ఒడిదొడుకులోజీవ మొలికి పోవకయుండ ॥హిందు॥

మాధురి—అమ్మో యీవాలకమేమిటి. అయ్యయ్యో కల్లు త్రాగినారు.

చిరం—అరెర్రెర్రె. పోపో అంతాధ్వంసంచేశీశావు. నాప్రయాణ మంతా యెగిరిపోయింది. స్వర్గానికి కట్టుకున్నమూటంతా కుక్క ముట్టుకుపోయింది. ఇప్పుడు నువ్వెందుకూ యిక్కడ మునిగిపోతూన్నట్లు—

మాధురి—అయ్యయ్యో యేంబారి కల్లుతాగినారు.

చిరం—కల్లుదాగినారు. కల్లుకనపడలేదూ కళ్ళంటావూ కల్లేంటి. ఇది విశ్వామిత్రరసం. కల్లంటే కళ్ళుపోనేపోతాయి.

మాధురి—అయ్యో! ఇదేం ప్రారబ్ధం. నిజమే. ఇది త్రాగితే విశ్వామంతా అమిత్రతే—

చిరం—పోపో బడికిపోయి చదువుకో - లేకుంటే పనికిరావు. నే యదార్థం - తెలుసా. యేదార్థం అందాకా చెబు తావిను. విశ్వం. ఇది స్త్రీప్రకృతి. దీంతోమిత్రత్వం అంటే సరసం - అంటె స - రసం. ఇందులో నీయుధ రసంమిళితం. అంటే యిలా కలిపితే - (పైనకలియ బడ బోవును.)

మాధురి—(తప్పుకొని) గురువుగారు చూస్తే—

చిరం—ఆఁ గురువుగారు - చూస్తే యేం? గురుదక్షిణ ముట్ట చెప్పేస్తాను. పోనీ వారివెనక నీవూ మొదలెట్టావు కదూ. ఉపదేశం. అంచేత ఆగురుదక్షిణ లోటురా కుండా నీ కే ముట్టచెప్తా. (కొట్టును.)

[మాధురి నేలబడి యేడ్చుచుండ ప్రవేశించి]

విశ్వా—ఏమది చిరంజీవా. సిగ్గుమాలినపని.

చిరం—అయితే నాకు సిగ్గుండాలంటారు. అవును. ఆడదాన్ని కానుగనక ఏం - అంతేనా—

విశ్వా—నీ భార్యను కొట్టవచ్చునా? తప్పుగాదూ.

చిరం—మరియొకరిభార్యను అసలు కొట్టకూడదయ్యా పిచ్చి సన్యాసీ—

విశ్వా—కాదు - ఆడది.

చిరం—ఆడది - సిగ్గులేనియాడది - గాడిది. ఆడదానికీ గాడి దకూ బాడిదకూ కర్ర లేకపోతే పనిసాగదు. ఇంతకూ మాదాంపత్యంలో మధ్య నీకెందుకయ్యా! పానకంలో

ఫుడకలాగు. పప్పుబియ్యంలో పలుదోంపుడకలాగు
కలియబడితే బద్ధరంసుమా (కద్రమ్మాఘ్రాను.)

[గౌతముడు ప్రవేశించి]

గౌత—చిరంజీవా, యేమది?

విశ్వా—సోమరసమైకంలో మాధురిని కొట్టినాను.

గౌత—అయ్యయ్యో! యెంతపనిచేసితివి! పోనిమ్ము. ఇక త్రాగనని ప్రమాణముచేయుము.

చిరం—తప్పునాదికాదు గురుడా - సావాసం. రోజూ తాగు తాగు అని చెవినిల్లుగట్టుకొని పోరుతూంటే నాకు మాత్రం ఉప్పూ పులుసూలేనీ వొళ్ళువుండబడుతుందా. ప్రమాణమెందుకు - త్రాగనేత్రాగను. యెప్పుడో యీ మహర్షి త్రాగినప్పుడు తప్పు-అదేనా వారి స్త్రైనే—

గౌత—చాలు.

గీ. చంద్రునకుమచ్చ భూషయానరణి ఘనుల
దోషమునుచెల్లు ధరణిలో తోడవ్రకరణి
మట్టి సంపర్కమునను అగ్ని మైలపడదు
గాని జలములు కలుషమై హీనతంగను.

అది మనబోటి యసమర్థులకు చెల్లదు. ప్రమాణముచేయవా!

చిరం—అరెనాసామీ— నువ్వొక్కడొచ్చావయ్యా ఉమ్మెత్త కాయ సదును- (తలపై చేయివేసుకొని) ప్రమాణము గురుడా ఇక త్రాగను- త్రాగను- త్రా-గ-ను.

గౌత—పరిశోధనలకింకను తట్టుకొనలేదు. రంభ ఆశ్రమమునకు పోదము. (అందరును నిష్క్రమింప తెరపడును.)

## ద్వితీయాంకము—మూడవరంగము.

---

గౌతముని కుటీరపుముంగిట దేవతామంటపము నలంకరించుచు అహల్య ప్రవేశము.

అది నాశమే ప్రేమా అనవకాశభయవియోగములచే ॥అవి॥
భువిలో దానిలయింపగప్రియునిత్రృణీకార ధిక్కారముల ॥అ॥

గౌత—ప్రియే.

అహల్య—(తుళ్ళిపడి వెనుదిరిగి లేచి నమస్కరించి) ప్రభూ యేమిది? ఇట్లువచ్చితిరి? విశేష మేమి?

గౌత—అగును చెప్పిపోవుటకు వచ్చితిని.

అహల్య—చెప్పిపోవుటకా, తెలిసినది. మరల నెచటికో ప్రయాణము. అంతియేనా?

గౌత—అగును. తపస్సునకు. దూరదేశము.

అహల్య—తపస్సునకా! యెవరినిగూర్చి? ఇచ్చట నేకూడదా?

గౌత—ఊఁహూఁ! అసంభవము. లక్ష్యసిద్ధికి యేకాగ్రత యవసరము.

మ. అరయన్ మందిరబంధుమిత్రజనమా యామోహ
వాతాహతిన్
శరవేగప్రగతిన్ భ్రమించునది యీసంసారచక్రంబు దు
స్తరమీాయస్థిరదుర్వ్యవస్థబడి చిత్తం బీశ్వరాయత్తమై
చరితార్థత్వముకంటకాన విజనస్థానంబె చేరన్వలెన్.

అహల్య—బాగున్నది. పొండు.

గౌత—ప్రియే. మనసారవీడ్కొందువా?

అహల్య—మనసారవీడ్కొల్పుటా? ప్రభూ. నన్నెవరివెంత నుండుమని?

గౌత—అదియా.

గీ. కొమ్మ పతిఇంటనున్నలే కున్నస్వీయ
మానసమ్మున పతిప్రతిమమ్ము నిల్పి
కొల్చి సంతృప్తిఫలముగా కొన్నయదియె
వరపతివ్రతయను పేర బరగునవని.

అహల్య—అట్లనా? ఆహా!

ఉ. ఈవిపరీతధార్మిక సమీక్షమహాద్భుతమయ్యె హేప్రభూ,
త్రావకనే తటాకపటదర్శనమాత్రను దప్పితీగునే?
పోవునె శీతబాధగదినూలను దుప్పటియున్ననంగతిస
భావమునన్ స్మరించిన? ప్రపంచమునందటులుంటసాధ్యమే?

తాకినంతనే తిరుగబడిపోవు యినుకదొంగ్లలంగోరు తరంగముల పలె దుర్బలహృదయులగు స్త్రీలచెంత వీరు తార వచ్చునా. మేముమాత్రము వీరుదగ్గరనున్నను లేకున్నను తమ్ము స్మరించుకొనుచు కాలము గడుపవలయు నట. తాము యథేచ్ఛగ దిరుగవచ్చునా? తాము మాత్రము గూపవతుల పటములను దర్శించియో, స్మరించియో తృప్తిపడగూడదా? యవ్వనవుజిగి సడలి

ముసలితనపు టంతిమరేఖపై నిలిచియుగూడ రేకవీడని
లేతకోరకములనే కోరి యేరుకొని యనుభవింపవలెనా?

గౌత—అహల్యా! చాలు నీదాంపత్యవైఖరీసిద్ధాంతము.

మ. లలనా, ప్రేయసి చీరచెంగుగొని జీరాడంగ శాసింతొ? ని
ర్మలవిధ్యుక్తనిరూఢకర్మనధనీమ భ్రష్టనై బ్రాహ్మ్యమున్
తలగంద్రోతునె? చాలుసీద్రుశ్శవృథాతర్కంబు నేపోవగా
వలయున్ మానసదుష్ప్రవృత్తి మరళింపన్ చూచు
కోమిష్మపయిన్.

అహల్య—(ఆవేగముతో లేచి నిలచి) లేకున్న పెండ్లియేల
చేసుకొనవలయును. సడలిపోవుచున్న వార్ధకమును
నవసవోన్మేషయవ్వనముతో జతపూన్పనేల? కొనలు
సాగుచున్న యీయవ్వనము. నిగ్గులు దేరుచున్న యీ
రూపము, తృప్తినెరుగని యీవిషయవాంఛ పాల
పొంగువలె నుడికిపోవుచున్న యీ యాకాంక్ష—వ్యగ్ర
ముగ చివురుపోసుకున్న లతను శుష్కనిర్జీవకఠోరకాష్ఠ
ఖండమున కంటగట్టితివే. పరాత్పరా. నాబోటి
యభాగినుల హృత్కుహరజ్వాలాముఖి నిగళనిష్ఠుర
నిశ్వాసధూమశిఖలం దెగిరిపోయెనా భర్తృబాధ్యతయు
నీయునికియు—

చిరం—(వెలుపలనుండి) నాకు తెలుసునయ్యా - స్వామీ,
నేనూ విశ్వామిత్రులవారున్నూ యిక్కడ విసిగివేసారి
వేగిరిస్తున్నారు.

గౌత—ఓహో! సరియే దేవీ - పోవుచున్నాను.

అహల్య—ఆహా పోవచ్చును. ఉండవచ్చును. నాకు రెండును ఒక్కటియే - ఇప్పటి మీయీ పోకతో నాకుమిగల మునుగునదిలేదు. హా! హృదయమున ప్రేమతంతువులు లేవు. అధరమున మధురిమములేదు. కర్తవ్యపాలనము గోరునది మీరు, భోగములాసించునది నేను. జీవితా వధులేవేరు. ఇవి కలియవు. కావున స్వేచ్ఛగ పోవచ్చును.

గౌత—విధియవిలంఘనీయము. అంతమున కన్నియు సరిపడును. (నిష్క్రమించును.)

అహల్య—(తలమోదుకొని) హతభాగినీ అహల్యా-నీబ్రతుకు చెడ-అడగినదామిడిసిపాటు? మురిగినదా నీమురిపము? చూడుము - ఎట్లు పోవుచున్నాడో ఖంగునమ్రోగు కంచుకాళ్ళతో నీ యాసలకు మేకులుగొట్టి వెనుక చూడక వెడలినాడు. చూడుము. చూపులు చిల్లులు వడి కన్నీరు సర్వమును గర్వమును కొట్టుకొని పోవ నోడిచినమీదట ఘోరలుడిగి తెరిపిగాంతువులే—

(శూన్యముగా చూచుచు నిష్క్రమించును.)

తెర పడును.

## ద్వితీయాంకము—నాల్గవ రంగము.

ఇంద్రలోకమున తాపసవేషము సవరించుకొనుచు
ఇంద్రుడు ప్రవేశము.

మ. ఎదలేపయ్యెద తోరవంతనునుసిగ్గేపారు వాల్చూపుతో
మదహంసీగతితో స్వయంవరణసీమన్ మించుమైదీవతో
నుదయంబాయెను నాడు యవ్వనవికాసోదీర్ణ సౌందర్య కా
ముదియై నేడుదయించునాదుహృదయాంభోరాసికిన్ పర్వమై.

సుఖానుభూతిపుణ్యము. అనంతపుణ్యమే అమరత్వము. అమ
రాధిపతినైన నాయంతవాని యనంతపుణ్యమును విశ్వా
మిత్రుడెత్తి పొడిచినట్టే కొమ్మననుభవింపక పోవుటచే
అపూర్తసుఖమే. ఇకనింద్రత్వమెట్లు పూర్ణమగును?
అదియు పూర్తిగావలయు నీనాడు. నాడు స్వయంవర
మున కించిద్వ్యక్తికి చిక్కి యాబాలబడుగుగౌతము
పాలబడినది గాని యావన్నెలాడి కన్ను నన్నుతప్ప
గలిగెడిదా? అయినను మదవతుల కదును కల్పింపక
ఊరక నెపమాడపాడిగాదు. ఈపాటి కా రతియూ
సుదతిమనోపీట వాసనావీధుల దిద్దియేయుండును.
(సురసేవించి) పోయెదగాక. (అద్దము చూచుకొని)
వెరగొల్పుబడుగు గౌతమవేసముగాక మరులుకొల్పు
వయసు తాపసివేషమేయమరినది. (నడచి) కాలు వెను
దీయుచున్నదేమా? అధోలోకగమనమున కిదియే

ప్రథమమగుటచేగాబోలు!(పటాంతరమునుండితిరిగివచ్చి)

ఇదే మానవలోకవాసన. అదెపోలు నాసుందరి. ఆహా

ఉ. ఈజగదేకరమ్య సుమమీావనవీథినిపూచి యారకీ
సాజపరీమళంబు వెదచల్లుచునున్నది బండరాలపై
రంభ, మేనక, ఊర్వసీ, తిలోత్తములుత్తముత్తకాళీనుత్తే
యీాపుత్తడిబొమ్మకడతొత్తుదనంబునకుగూడపనికిరారు
యోజనలేదిసీవిధికి యోజ్ఞమనోజ్ఞ అమూల్యరత్నము
వజడగర్భమందొ సృజియించును శుద్ధవిరుద్ధపద్ధతిన్.

సరియే యీా పొదమాటునుండియే యదును కనిపెట్టెదగాక

(ఒకపొదమాటున నొదిగి) ఓహో యేమది?

చ. అరసగమాామృణాలతనువల్లన వ్రాలిచియావులించుచున్
విరవిరవాయిపై చిటుకవైచుచు కన్దొవమోడ్చి భారబం
ధురకుచయుగ్మ మొబ్బిడిగ దోరుపయొంటను దొంతరింపని
ద్దురతమినిట్టెదోగినదదే శిథిలాంగవిలాసముగ్రతోన్.

గడపకదలినఘడియకార్యవిలంబమని కాబోలు కాలు నెను కాడినది. కొరమాలిన పిరికితనము నాకేల! తాలిమియేా సర్వార్థసాధనమూలము. (నిదానించి) ఎవరా ఛాయా రూపిణి. ఓహోరతి. సరియే. ఈమె కెరుకపడకుండనె యరసెదగాక యీాజాణ స్వామికార్యపరత. కాని- ఇందే యొకరు నను చూచినను చెరుపు వాటిల్లును. కాన స్థలాంతరమే నాకు ప్రస్తుతకర్తవ్యమును- గత్యంతరమును. తెరపడును. (నిష్క్రమించును.)

# పా షా ణి

తృతీయాంకము—ఒకటవ రంగము.

[వెనుకటి రంగము నిదురలో అహల్య కలువరించుచును (ముసుగునుండి) ఛాయారూపిణి రతియు, పొద మాటున ఇంద్రుడు.]

అహల్య—యెవరమ్మా మీరు?

రతి—అతిథిని.

అహల్య—భోజనమైనదా లేక ఆకలిగొనియేయున్నారా?

రతి—ఆకలిలేదుగాని దప్పిగొనిమాత్రమున్నాను.

అహల్య—ఓహో, చాలచిత్రముగన్నదే. ఈనడివర్షాకాలమున చెరువులు నదులు బావులు, అవియివి యననేల? పల్లమున్న ప్రదేశమెల్ల జలమయమైయుండ మీకు దప్పియేతీరలేదా?

రతి—చిత్రమేమున్నది? సరోవరజలములు చాతకముల దప్పి తీర్చునా?

అహల్య—యేమివ్యధికరణము! మీభావమేమో తెలియకున్నది.

రతి—మీరు అద్దమెప్పుడైనా చూచుకొనినారా!

అహల్య—ఆఁ. చూచితిని. అయిన నవేందులకిప్పుడు?

రతి—అమాయికురాలా, నీ ముఖసౌందర్యసుధ యెంత త్రావినను దప్పితీరలేదు.

అహల్య—ఓహో - అదియా, కాని- నీవును- స్త్రీవే!

రతి—కావచ్చును - ప్రకృతిలోని యందము పురుషులేగాని స్త్రీలుమాత్రమానందింపరాదా?

అహల్య—సరియె - బాగున్నది. కాని - మీ పేరు? నివాస మెచ్చట?

రతి—రతినా పేరు. స్వర్గనివాసినే కాని కార్యార్థినై యీలోకమునకు వచ్చి ఇచట నీయీరూపచ్ఛటకు విత్తాకువడి నిలచిపోయితిని. సఖి నీపేరు?

అహల్య—నన్ను అహల్యయందురు. తాపసకాంతను.

రతి—అహల్య! యెంతభాగ్యము! ఈపేరు మాస్వర్గమునకూడ మ్రోగినది. (ఆకసముచూచి) సఖి, వర్షమురానున్నటులున్నది. రాత్రి కిచ్చటనుండిపోవుదునా? నీకిబ్బంది లేదుగద.

అహల్య—(నవ్వి) ఇబ్బందియా! యేమియు లేదు. నాకు పరమసంతోషము నాస్వామిపరదేశమేగినాడు. ఒంటరినే- రండులోనికి.

రతి—పోనిమ్ము. యెట్లోపో యెదనులే- కాని నాకొక్కటే విచారము- యీవయసున- యీ యొంటరిపాటు ఎట్లు గడుపుచున్నావా యని అడుదానివై పోతివిగాని- మగవాడ వైతివేని—

అహల్య—ఏమి నీకు తోడురమ్మందువా?

రతి—తోడు. కాని యట్టితోడునకుగాదు. ఇట్లు – (కౌగలించు నట్లు పైన చేయివైచును.)

అహల్య—(ఉలికి పులకరించి యొత్తిగిలి నిద్రలోనే) పోనిద్దగూ యేమిది? మనలో యెందుకొచ్చినది!

రతి—యేమీా - వెగటుగానున్నదా!

అహల్య—లేదు. కాని యేమిలాభము? గడపుకొనకేమి చేయుదును?

రతి—యేమిచేయుదువా? ఇట్లు తరుణులు లభించినపుడు పురుషులేమి చేయుదురో అదియే. అశంకరుడేమిచేసెను బ్రహ్మయేమిచేసెను?—ప్రకృతి కెదురీతయా! అసాధ్యము అదును ఆకట్టిన నిలువదు. వయసుక్షణికము సమయము చిక్కినప్పుడే సుఖమనుభవింపవలెను. గడచి పోయిన వయసును తరుణమును తిరిగిరావు. మంచిచెడ్డ లెంచుకొనుచు కూర్చుండిన పుణ్యాకాలము మించి పోవును. ఆవెనుక మిగులునది విచారమే. కాన సమయ మెరిగి సామాన్యముగ సహజరీతినె వర్తించుము. కాని వ్యర్థజీవివి మాత్రముకాకుము. నేబోవుచున్నాను. రతి నిష్క్రమించును.

అహల్య— (యులికిపడిలేచి కనులు నులుము కొనుచు నలుతట్టులును చూచి) రతీ – రతీ. (పరికించి) యేదీరతి? ఓహో, కలయే గాబోలును. కాని యెంత తీయని కలయనుభవము! ఆమె చెప్పినది నిజమే. అసా

ధ్యమే - తప్పేమున్నది. (కోయని, కూతవిని అదిశ్కు తిరిగి దూరమున నదిలో నౌకావిహార మొనర్చు యుగ్మమునుచూచి) ఓహో యెవరోకదా ఆభాగ్య శాలురు (నిదానించి) ఏమది?

చ. అదె ప్రియురాలి పేరురమునందల రుల్సరిచేసి మెల్లనన్
యెదకెదహత్తి నోరగయొకించుక వ్రాలియూపెకెం
బెదవుల తేనెలానుచు తపించెడి చెక్కిలిచెన్నుగిల్లగా
నదెయనురాగముద్రనిడెహో యదియెంత మనోజ్ఞమోగదా!

సీ! పాడుకోయిల నాటృష్టి నీదెసమరల్చినది. (ఒడలు పులక రింప) ఏమి నాలో నీజలదరింపు? యెదలోనీవిద్యుత్ప్ర సారతీవరతయేమి. ఉహు నీరుగారిపోవుచున్నానే - ఏమీామార్పు. అబ్బా - శీలమును గీలమునట- (నిదా నించి) యెవరా వచ్చుచున్నది పురుషవ్యక్తియే. కాని సన్యాసివలెనున్నాడే. బలిష్ఠమగు నేనుగు నడకలోని ఠీవినొలికించుచు యిటు వచ్చుచున్న యాతని బంగారు బొందెయందము మనసును తొందరచేయుచున్నదే చూడుమని. - పిలతునా? ఎవరో, యేమో. అవును పిలచిన తప్పా? ఊం - పిలచెనగాక యేమిపోవును? ఓసామీ—

[ప్రవేశించి యింద్రుడు]

ఇం—తాపసమందరీ పిలచితివా?

అహల్య—ఆఁ - తామెవరాయని—

ఇం——ఎవరేమి? తాపసివేషమేగదా. తాపసినే—

అహల్య——ఈ వయసున తాపసవృత్తియా! ఎచటికిపోవుట?

ఇం——వయసునకును వృత్తికిని సంబంధమేముండును. వయసు కాలముతోనే గడచిపోవును. కొంతకాలమునకు మరల పునకేవచ్చును. దానికేమి? మిథిలాపురికి పోవలయును. ఎంతదూరముండునా మిథిల? క్రొవయో క్రొత్తదగుటచే తొట్రుపడుచున్నాను.

అహల్య—తొట్రుపాటేల? మిథిలయెంత దూరమున్నను, యీ సంజనంటి వెన్నెలదూ మెరుగుమాత్రమున్నది.

ఇం——సరె. దూరమునకేమిలే— యీమాత్రము రాగమున్నది కదా. మనసుండిన దూరమే కానుపించదు. పోయి వత్తును. ఆఁ— మీపేరేమి!

అహల్య——వయసు. మనసు. రాగము— (గొణుగుకొనుచు) చిత్రముగనున్నదే— ఆఁ నాపేరా! అహల్య (నాల్క కరచుకొని) యేమో పెద్దలుంచిరి కాని ప్రస్తుతము ప్రో—షి—తే—ప—తి—క—ను.

ఇం——సందేహించి సంధిగ్ధపడనేల?

అహల్య——సందిగ్ధమెందుకు. సంసిద్ధమే. అఁహా— యదార్ధమే. రండు ఆశ్రమములో నాతిథ్యము స్వీకరించుడు.

ఇం——అఁహా— వలదు— యీరాత్రి తడసిన అంతయు చెడిపోవును.

అహల్య——లేదు. లేదు. రావచ్చును. పోవచ్చును— ఇంతతడసినంతలో మునిగిపోదుగద. కాని అవ్వనధిగవను లెట్లు

జరుగును. మీయనుకొన్నది కాకపోదు. మీపనులకు నేకాదనను- అన్యులవలె భావించి సందేహింప నేల? తాము వచ్చితిరిగదాయని సంతోషించుచుండ తామన్యథా తలచి నిరాకరించి నను చిన్నబుచ్చుట న్యాయమా.

ఇం—సరె! చిన్నబోనేల? యథాసంభవసంయోగ్యమ వశ్య భోగ్యమర్హసి- నారాయణ.

(అహల్య- వెనుక నింద్రుడు లోనికి పరిక్రమింప తెరపడును.)

---

## తృతీయాంకము—రెండవ రంగము.

---

ఆశ్రమోపాంతమున మాధురి విచారంతో ప్రవేశం.

మాధురి—అయ్యో! యెంత మోసము! ఎంత ఘోరము! యెంత తలవంపుపని. ఈపాపఘటన పలువురకును తెలిపిన యేమిఫలము.

చ. అసమవయోవకుంఠితము హాసముఖోన్ముఖమైనలాలసా
కుసుమముడాగె నిందనుక గూడక ఇప్పుడు నాథుడూరలే
నిసమయమందు విచ్చుకొని నేలయునింగియురొప్పవాసనల్
ఉసిగొనికొంటెతేటి మధువున్ హరియించుట గాననేరమిన్.

యేమిచేయును? ఊరకుండనా - ఒక్కనాస్వామికి మాత్రము చెప్పెదను. ఓస్వామీ!

[ప్రవేశము చిరంజీవి]

చిరం—ఏం నన్నేనా? పిలిచావా? ఏం పనుందా?

మాధురి—(అన్యమనస్కతతో) ఆఁ - మంచిది. చిన్నది. ముఖ్యమైంది. ఒకటుంది.

చిరం—ఓహో! చిన్నదే. చిన్నదంటే తన్నినట్లు నిలబడింది కాలు. వేగంకానీ—

మాధురి—ఆశ్రమంలో గురుపత్ని యేమిచేయుచున్నది?

చిరం—ఓస్స! ఇదాపని. బాగుంది. ఏముంది! కళ్ళువిరచుకొని ఒళ్ళు నులుముకుంటూ - ఆఁహాఁహాఁ. అటుంచిటు కాబోలు. ఉంటుంది.

మాధురి—అటేమి? ఇటేమి?

చిరం—దానికోసమేతగవూ తంటా - అదివ్వఁటేనా వంటా పెఁటా అదిలేకుంటే అమ్మగారిటు అయ్యగారటు పొరుగుపోరటు - కుదిరీ కుదరనివలపు - పెడజరిచిన కురుపులసలుపు - అబ్బ—

మాధురి—అబ్బ. యేమాధోరణి. వెర్రియా- వేదాంతమా?

చిరం—అదే- అదే- అర్థమైతే అది- వ్యర్థమైతేయిది. సరె మనకెందుకుగాని - నాకో సందేహంవుంది తీర్చి చెప్పమా చూతాం.

మాధురి—చెప్పండి- సందేహమేమో.

చిరం—నిజంగా నీవు నన్ను ప్రేమిస్తున్నావూ?

మాధురి—మీాకందుకు సందేహమేమి?

చిరం—అఁహ. నాకూ అలాగే అవుపడుతూందిలే—

మాధురి—మరిహ సందేహం దేనికి?

చిరం——దేనికా- నీవు నన్ను బాగా ప్రేమిస్తున్నావూ?

మాధురి——యెక్కువగా ప్రేమిస్తున్నాను.

చిరం——అవునా- మరి- నేనుమాత్రం నిన్ను బొత్తిగా ప్రేమించంలేదు.

మాధురి——ఏం? నేను వారకాంతననా?

చిరం——అహాహా- వారకాంతవూగావూ దూరకాంతవూ గావు ఆడదానివికనక.

మాధురి——మరి మగవారిని ప్రేమిస్తారా?

చిరం——ఊ హుహూ.

మాధురి——ఏమో మీరు ప్రేమించండి మానండి. నేను మాత్రం.

చ. మనసునవాక్కునక్రియుల మారొకలక్ష్యములేక ఒక్కమీ
యనుమతవర్తనంబె పర మాపధిగా నొనరించుకొంటి మీ
గుణములనెంచ రూపమునుకోరను ప్రత్యుపకారమానచో
యను ఇదెనాదుప్రేమ విడుమన్ననువీడను ఆత్మసాక్షిగాన్.

దానికేంగాని ఆశ్రమంలో యెవరున్నారు?

చిరం——ఎవరేంటి. పిల్లలు, కుక్కలు, యెలుకలు. అన్నట్లు మనలేడి నిన్న యీనేసింది.

మాధురి——అదికాదు ప్రభూ! మనుష్యులు.

చిరం—మనుష్యులా! ఆడువారా మగవారా!

మాధురి——మగవారే. ఒకసుందర యోగివచ్చునట పోవునట.

చిరం——ఆఁ - దానికేం? వస్తారు - పోతారు-అదో యోగం.

మాధురి—లేదుప్రభూ - రాత్రివచ్చి వుదయమే పోవునట. ఆ ఆవలియొడ్డునుండి—

చిరం—ఓహో! బోధపడింది. ఈమాత్రం తెలీదు. చిరంజీవికి! పట్టుపంచకట్టినా, నారచీరగట్టినా జాతిలక్షణామెట్లు పోతుంది భామా.

మాధురి—సరే. మీరొహాటిచేయాలి. యీరాత్రి మెల్లగా వెనుకనుంచి అతని పట్టుకోవాలి.

చిరం—ఓస్ యింతేనా? వెనకనుంచేం ప్రాలుబ్ధం. యెదుటినుండే పట్టుకుంటాను. పట్టుకుతీరుతాను. తన్ని మరీపట్టుకుంటా. చూడిదిగో పట్టుకుంటా.

[బ్రహ్మచారి ప్రవేశం]

నమస్కారమండోయి - చిరంజీవిగారు.

చిరం—నిమ్మకి పాసకంబోసినా, నిమ్మకాయఫులుపే - ఉల్లి మల్లిగాదు. కల్లగాదునిజము బ్రహ్మకైన. తెల్లకాకులున్నెకల్ల భూమిలోన. వల్లకాటిమనసు మళ్ళిరాదు తిరిగి. ఇల్లులేదు. కన్నపిల్లలేదు. లేదిహా పట్టుకుంటా నిన్నుపట్టుకుంటా. నీవు నావాడివేనా - అహా మగవాడివేనా. నిలబడు పట్టుకుంటా.

(చిందులుతొక్కుతూ సందిట బ్రహ్మచారిని పట్టుకొనును.)

బ్రహ్మ—ఇదేమండి అసందర్భము— నేను శుభవార్త తెచ్చా.

చిరం—శుభవార్తే- యెక్కడ యెవ్వరికి. పెండ్లా - ఆప్తైదా.

బ్రహ్మ—కాదండి గౌతములవారు యీ వారంలో వచ్చే స్తున్నారు.

చిరం—ఐందీ - నేనెరుగుదును - ఏం? యెందుకొచ్చేస్తారు?

బ్రహ్మ—యేమో, రాక్షసులు విఘ్నంచేస్తుండటంచేత యాగం సాగక అది దశరథునికి విన్నవించి - రామలక్ష్మణుల్ని ఆరాక్షసుల్ని చంపగలందులకు - పంపగలందులకు - వేడుకోగలందులకు వేంచేశారట. వారటు వీరిటు.

చిరం—అంతే. కోతికి జలతారుకుళ్ళాయి ఏటికి. ముసలిబడుగు కేల ముద్దరాలు పద యింటికిపోదాం.

తెరపడును. (నిష్క్రమింతురు.)

---

తృతీయాంకము—మూడవ రంగము.

---

[అహల్యామహేంద్రులు - ఏకాంతముగ :కుటీరమున, నేశె నొకమంచముపై నొకబాలుడు వీరిరువురును మరొక శయ్యపై కూరుచుండియు - ప్రవేశము]

అహల్య—తొలుత నాకీవిషయము తెలిసిన నాహృదయము నీకర్పించియుండను.

ఇం—నావలన నేదోషమున్నది?

అహల్య—బహుదోషములున్నవి. కేవలము లంపటుడవు శచి గాక పలువురు అప్సరలును నీయాస్థానమునసుందురట. మరియు—

ఇం——బేలా, నామీద కిట్టనివారాడుమాటలు నమ్మకుమా
శచి పట్టపురాణియేగాని హృదయాధిదేవతగాదు. మరి
యచ్చరలా - కేవలము నర్తకులేగాని రాగిణులుగారు.
అహల్య——ఏమో. యెట్లైన నన్ను మనసారప్రేమించితివని
నమ్మకమెట్లు.
ఇం—మ. కలికీ నీప్రణయోర్మివాసనల మైకంబుండునేనందనో
జ్జ్వలమందారములందు (శిరము మూర్కొని)
యీమృదుత నూవల్లీపరిష్వంగ పే
శలమే ఆనవనీత ము (కౌగలించుకొని)
ఈ దృససుధాసారాధరోదారమే
అలదివ్యామృతపాత్ర (చుంబించి).
వీనినెడబాయన్ సాధ్యమా కార్యమే!
అహల్య——అబ్బ (మోముత్రిప్పుకొని)
చ. వలదిక చాలునీ కలుషవర్తన నల్వురకింక బాగుగా
దెలియదు ఏదియో మునుగతించినదెల్లను విస్మరించి వే
మలగి చనంగ నిర్వురకు మంచిది నీదెస నీవుపొమ్ము నా
కలుషితమైన కట్టెనెటుగానో నశింపగజేతునీపయిన్
ఇం——ఇంత పేలవమైన యాలోచనచేసితి వేమి? బేలా! చూడు.
సీ. పటునిరాశా మేఘపటలమ్ముజీవితా
కాశంబు చెడగ్రమ్మ గాదరింప
సంఘకాఠిన్య ఝంఝామారుతమ్ములు
చెలరేగి హృదయమ్ము చీదరింప

శుష్కనిష్ఠురధర్మ సూత్రాగ్ని నెరికొనల్
అనురాగవిరిపుంజమును దహింప
కడగండ్ల జడివానవడగండ్లబడి కన్నె
వలపురెమ్మలు దూయబడి నశింప
గీ. ఆత్మహత్యయు సంభవమగునుగాని
పండువెన్నెల నిరసించువయసు గలిగి
మురిసి మురిపించుప్రియుడు నీసరసనుండ
చావజూచుటయేటి ప్రాజ్ఞతఅహల్య.
అదిగో నావ సిద్ధముగనున్నది రమ్ము.

అహల్య—(అన్యమనస్కముగా) ఆఁ - ఎక్కడికి?

ఇం—స్వర్గమునకు—

అహల్య—(ఉలికిపడి) స్వర్గమునకా. ఊఁహూ. వలదు. గౌతముని భ్రష్టభార్యయని ఆలోకులు వ్రేలెత్తిచూపినప్పుడు నాహృదయము వతాలున వ్రేలకమానదు. అచటికి కాదుగాని - ఏదేని నిర్జనద్వీపమునకు కాదు - దిగంతరేఖమాటునకు - వలదు నరనిశ్వాసము చేరరాని యగాధ జలధిగర్భమునకు. ఊఁహూ - ఇన్నియేల? నా నిందాధ్వని నాచెవుల సోకనిచోటుండిన - అచట అతృప్తవాసనా జలధిలో లాలసాతరంగములలో ఆనంద రతినౌకపై యుగయుగాంతములవరకు తేలిపోగలిగిన.

ఇం—అగును రమ్ము. అట్టి నిర్జనతలముననే నిన్నుంతును - చంద్రకాంతో పలసౌధముల మందాకినీ కుందకుసుమశ

య్యల అశేష అనిమిషకామినీ - అహాఁ - మరచితిని. వారుండరాదుకదూ. త్రిలోకాధినాథమహేంద్ర సేవిత చరణ పద్మప్రభావీ - అహల్యాదేవీ - పరాక్ - అని (కపోలముపై చిటుకవేసి) హెచ్చరికలతో సేవించెద-రమ్మా.

అహల్య—సరేకాని. నా శతానందుడో. అమ్మో.

ఇం—యిదియా? మీయాశ్రమవాసులులేరా. యీమాత్రపు పనికి? వారు చేరదీసి పెంచరా? నీశతానందుని?

అహల్య—కాని, సరేపద అకీర్తిదీర్ఘికను పడుదును. నరకబడబానలమందైనబడుదును. కానిమ్మా. భయంకరపాప పరిధీ - నీకరాళముఖగహ్వరమున దాచుకొమ్మా.

[మేల్కొని శతానందుడు]

శతా—అమ్మా - అమ్మా.

అహల్య—అఃహా! పాపడులేచినాడు.

ఇం—లేదు. ప్రక్కకొత్తిగిల్లినాడు—నింద్రించుచునేయున్నాడు. రమ్మునీవు.

శతా—అమ్మా - ఆకలే - ఊఁ—ఊఁ—ఊఁ.

ఇం—అరెరె. పాడుగోల - వీడెక్కడ దాపురించినాడు.

అహల్య—(వివశదృక్కులతో) నేనేమిచేసితిని.

ఇం—మనకు వీనియాటంకమేల. (పీకనులిమి వేయుఃమని సంజ్ఞ చేయును.)

అహల్య—(అదరిపడి) అమ్మో! నాబిడ్డ నేనాచేతులతో నే—

శతా—అమ్మా ఆకలే - ఆడెవడే—

అహల్య—(త్రుళ్ళిపడి) తెలిసిపోయినది. రేపిక గోలచేయక మానడు. భవిష్యముండదు. చెడిపోయినది. ఇక నేమి చేయగలను. అనుకొనని యశని నాయాశాసౌధమును అధఃపతనము చేసినది.

ఇం—ఇపుడైన బోధపడినగా. వెనుదీయవీలులేదు. సాహసించుము.

అహల్య—ఔను. తప్పదు. వెనుదీసిన సర్వనాశమే సిద్ధము. తీరదు. (యున్మాదినివలె చూచుచు - వణకుచున్న చేతులతో బాలుని మెడనులిమి ఆవేగముతో) ఆః! ఆః తండ్రీ శతానందా. నీజీవితాకలినే దీర్చితినే క్షమించు అబ్బ—

ఇం—చాలువేగరమ్ము. వాని యేడ్పుజన్మవదలి పోయినదిలే. రమ్ము. (చేయిపట్టి లాగినడిపించుచు ద్వారమువరకు తీసుకొనివచ్చి తాను బయటికి తప్పుకొనును - ద్వారమువద్ద చీకటిలో)

అహల్య—ఉఃహూ. ఐనది. మాతృత్వము ఘాతుకత్వమునైనది ఇక నాకు తావెచ్చట— [నేపథ్యమున, యింద్రుడు]

యిం—రమ్ము.

[మాధురి ప్రవేశించి]

మాధురి—దేవి యీసమయమున నిచటనేమి చేయనిలచితివి? (తప్పుకొని లోనికిబోవును.)

అహల్య—అయ్యో! పట్టుబడితిని. లాభములేదు. (వడిగ తొలగిపోవును.)

[ఇంద్రుని దిక్కుగా చిరంజీవి ప్రవేశించి]

చిరం—అరెపోతావురా. ఎక్కడకు పోతావు? నిలబడు - నిన్ను పట్టుకోవాలి—

ఇం—నీకు ప్రాణములపై ఆశయున్న వదలుము.

చిరం—ప్రాణంమీద ఆశలేకేం? వుంది. ఐతేనో! నిన్ను పట్టుకోవాలి. మరి-నిలబడు. (ఇంద్రుని సందిట పొదివిపట్టుకొనగా యింద్రుడు తన వజ్రముతో కొట్టును. చిరంజీవి నిష్ప్రహుడై నేలపడిపోవును. ఇంద్రుడు పారిపోవును.)

మాధురి—(తిరిగి ప్రవేశము. పడియున్న చిరంజీవిని చూచి) అయ్యో స్వామీ- ఇదేమి? ఇలాపడిపోయారేం? కదలరేమి? నాకేందారి! (లోనికిపోయి నీరు తెచ్చి చిరంజీవి మోముపై చల్లును.)

చిరం—(తెలిసికొని) ఊఁ. ఊఁ. వాడేడీ.

మాధురి—వాడెవరు?

చిరం—వాడేనే. దొంగముండాకొడుకు. అబ్బ! యీదెబ్బేమిటి? కాలినట్లు భగ్గునమండుతూంది. దాహం - దాహం. (మాధురి నీరుతెచ్చిపోయ చిరంజీవి త్రాగుచుండును. గదిలోనుండి మూల్గులువినవచ్చును.

మాధురి—ఆమూల్గెవరు. శతానందుడేమో (పరుగెత్తిపోయి తిరిగి తొందరగా ప్రవేశించి) అమ్మో! శతానందుడు

చచ్చిపోయినాడు. మెడ నులిమి వేయబడినది. (మాధురి బాలుని తీసుకొనివచ్చును)

చిరం—అన్నా. దొంగముండాకొడుకెంతపని చేశాడు.

మాధురి—అతడుకాడు. ఆమెయే - ఆతడు వెలుపలనే యున్నాడు.

చిరం—ఆఁ ఆఁ ఆమెయే? అడ్డమని - కన్నబిడ్డనే - గిన్ని పాలుచేసింది? ఘోరం? నీళ్లు మొహంమీద చల్లి నీరు కొంచెం త్రాగించు. (మాధురి అట్లుచేయును. శతానందుడు తెలివికొనియేడ్చును) ఆఁ ఆఁ యేడువు నాయనా, యేడువు– యేడుస్తే బ్రతుకుతావు. నువ్వేడవకపోతే నీకోసం మేమేడవాలి. నాతండ్రివిగావూ నీకు నేను మంచి చిలకపిల్లలు - అల్లిపళ్ళు, తాటిబెల్లం అన్నీ యిస్తాను. ఏడువుబాబూ యేడువు.

(శతానందుడు యేడ్చును.)

అమ్మయ్య బ్రతికేం - కుఱ్ఱాడు యేడ్చాడు. ఇహ నేడుస్తాడు. మాధురీ - పద. లోపలికి (మెల్లగా నిష్క్రమింతురు.)

తెర పడును.

---

## తృతీయాంకము—నాల్గవ రంగము.

[జనకుని సభామంటపమున - సింహాసనమున జనకుడు. ఒకప్రక్క గౌతముడు - శతానందుడు - చిరంజీవి మాధురి మరియొక దెస.]

గౌత—అప్తబంధూ, యేమిచెప్పను?—

ఉ. ఏనుప్రవాసమున్వెడలి యింటికిరానెదురయ్యె నాశ్రమం
బే నడికొప్పుగ్రుంగి వెరపించెనుచెంగలి ప్రాంగణాన నే
లోనికిబోవ తప్పుకొని లోగలదో మదిచక్క ప్రేయసిన్
పూనికబిల్వనోయనుచు ప్రమోసెప్రతిధ్వని నన్హసింపుచున్.

చిరం—గుడ్లగూబలు గూళ్ళుకట్టుకొన్నాయి - తలక్రిందు పక్షులు.

గౌత—అంతలో నీచిరంజీవియు మాధురియు వచ్చి జరిగిన దెల్లకపచ్చి తమ కుటీరమునకు తీసుకొనిపోయిరి. అచటి చావుదప్పి బ్రతుకుదీవిని బడి లేచి నిలువనశక్తుడైన యాశతానందుని. కంటిని. ఇప్పటికిగదా తేరుకొని కొంత కోలుకొనుచున్నాడు. అహల్యమాత్ర మగుపించలేదు. కాననమంతయుగాలించితిమి.

చిరం—నేనప్పుడే చెప్పాను. కాపురంచేయలేనివానికి పెడద మెడదగుల్చుకోవడమెందుకని. ఈడు కుదరని పెండ్లి, నే మొదట్లోనే అనుమానించా. లేతముదుసులదొందడి—

పాతకొత్తలసందడి నిలకడ శూన్యము ప్రమాదం
మున్నా అని.

గౌత—అగును చిరంజీవా! లోకసంగ్రహణార్థం చీకాకుపడ
వలసిందే.

చిరం—అది - అదీమాట. ఆమె యెవరో మందురాసిన
వానిమరిగి లేచిపోయిందంటే అసంభవమన్నారు.
పెనిమిటి దగ్గరలేనప్పుడు ఆడదాని తప్పుకాదని శాస్త్ర
ములోనేవుంది. కాని రాజర్షిగారూ - వాడు నన్ను
దేంతోకొట్టాడో కాని బాధపడినా బోధపడలేదు.
అన్నగత ఋణానుబంధం వుండిపోయింది గాని అయి
పోయానే అనుకున్నా.

గౌత—మిత్రమా! ఇక సంసారజాలము వీడి యెచ్చటికేని
దూరప్రాంతమునచేరి యీవిశ్వనియంత చింతనమందే
గడపుదును. ఇక నాకు మిగిలిన తగుల మీ శతానందు
డొక్కడే. వీని నీకడనుండనిమ్ము, నేను నిశ్చింతగ
నుండుదును.

జన—ఆహా! ఆ యనంతపుణ్యమున కెంతటితత్త్వహృదయమును
వెలబెట్టుచున్నావు. నీదశ కడుదయనీయముగ నున్నది.

గౌత—ప్రజ్ఞానిధీ! దయ నీయమేమి? దైవీయమే. ఇంక నింత
కంటె నేమికావలెను.

చ. కనుగవనింతకాలమును క్రమ్మినదుర్మమకారజాలమే
నను మరపించె. సాత్వికగుణార్చన ఉపరిణామకల్మినే

ననుకొనెదన్ పరాత్పరున సంతవిలాసమె దీనిమూల మెం
దును అనురక్తి లేదిక మదుత్తమసాధనసిద్ధికడ్డమై.

జన—సరె. నీశతానందుని నాప్రాణముతో పాటు రక్షింతును.

గౌత—చాలును. ఇక నిశ్చింత. (శతానందుని దిక్కై) తండ్రీ—

సీ. సత్యపరిజ్ఞాన సర్వస్వవిజ్ఞాన
జనకుడీ జనకుడే జనకుడయ్య
సర్వసమదృష్టి సహనభావాదర్శ
ఖనియైన మిథిలయే జననిరయ్య
విమలసౌశీల్యముల్ విపుల విశ్వప్రేమ
ములు నీదుప్రియసోదరులు కుమార
సదసద్విచార విజ్ఞానప్రబోధమే
పరమసద్గురునిగా నెరుగుమన్న

గీ. చేయునదిలేక వేరొండు చేతగాక
తరలు నీగౌతముడు కాదు తండ్రినీకు
కూళపశువాసనాలోల శీల యాయ
హల్యనీతల్లి కాదుర హాకుమార.

ఇదియేనాకు నీముద్దుపల్కులువిను కడపటి యవకాశము.
ఏదీ కడసారి - యొక్కమారు తండ్రీయని పిలువుమా.
విని పోయెదను.

శతా—తండ్రీ.

గౌత—(శతానందుని నోరుమూయుచు) అఁహా. వలదు. నీవు
పిలువవలదు. మరి పిలువవలదు. ఆపిలుపువిని మరల

సహించలేను - ఈచేతగాని తండ్రిని నీవేల పిలవవలె యును? నీకేమిచేసితినని 'తండ్రీ' యని పిలిపించు కొందును.

మ. సుతుడీతండని విద్యనేర్పితిన? ఈగుంజూడ సప్తాంగ సం యుత యోగాభ్యసనం బొసర్చితిన? జ్ఞానోపాధిగాబ్రహ్మ సూ త్రితుగానైన యొనర్చినాన? ఉరకేనీ తండ్రినన్ బిల్వనా మతి మోదించెదనంచు కోరతగ నేమాత్రమ్ము నేనంతున్ కై.

(శతానందుని చేరదీసి ముద్దుపెట్టుకొనబోయి - చటాలున ఆగి) వద్దు - నిను ముద్దుపెట్టుకొనుటయు వద్దు. ఇక పోయెదను.

చిరం—గురువుగారూ పోతాను పోతానని పదేపదే అంటు పోవడముత్తదే. నాకు దెలుసు. ఈబాధంతా యెం మాకు - ఉండిపొండి! పోతేనేగాని నీస్త్రీని నెత్తిని బెట్టి నెట్టిందెవరూలేరు - బాగుంది నాటకం!

గౌత—లేదు. చిరంజీవా! ఇదిగో పోదాం. యేదీ మాధుని?

చిరం—అదుగో ద్వారందగ్గిరేకుస్తూంది. నేనూ వస్తానని - ఇంకేంపనుంది! చిత్రంగావుంది. మీకూ నాకూనూ. విడిచిపోయిందే అని యేడుస్తున్నారు మీరు. విడిచి పోదేంరా అని యేడుస్తున్నాను నేను. అబ్బ కాల్చుకు తినేస్తున్నారు. ఆడది నిజంగా పులేనండి- అబ్బ యిష్ట మైతేనాకి చంపుతుంది. కష్టమైతే కరిచి చంపుతుంది.

గౌత—చిరంజీవా!

చ. పడతులకున్ మనోబలము భావము వారినిశీలపద్ధతిన్
నడిపెడుభారభాధ్యతలనారతముస్మృతిమైనవాని వా
కడిది ప్రయత్నమందు మునుగా తనుగావలయున్ సదా నిసం
గుడును ఆచంచలుండు నొడగూడుకృతార్థత అట్టివారికే.

జన—మిత్రమా? మీకు జయమగుగాక.

చిరం—మీకుఅంటే నాకూనా - యీమాధురికీనా - ఇది మరీవిచిత్రంగావుందే. మాయిద్దరికీ జయమెలా సాధ్య పడుతుంది.

(కొలువుచాలించి జనకడు నిష్క్రమించును. గౌతముడును నిష్క్రమింప - మాధురియు చిరంజీవిమాత్రము రంగమున)

చిరం—ఏం పోవూ? నువ్వెక్కడదాపురించేవు? మేం తపస్సుకు బోతూవుంటే నువ్వెందుకూ వెనకాలే?

మాధురి—ఎక్కడికిపోవుదును స్వామీ - నేనేమికీడుచేశాను?

చిరం—ఏంకీడా - అంతాకీడే - కీడుగాక మేలెక్కడేడిసింది? మెల్లిగా నాకాళ్ళకు సంకెళ్ళయిపోతున్నావు. పో- పో- చెప్తూతున్నాను. పో - యేం పోతావా?

మాధురి—ఊఁహూఁ.

చిరం—పోవూ. హరి! భగవంతా! చచ్చానురాబాబూ ఇదిగో యిదీ నీవల్లకీడు.

మాధురి—ఇదెక్కడిన్యాయము స్వామి. నాపరమగతిమీరే కదా! భర్తకు భార్య నీడవంటిదనిగదా శాస్త్రములు చెప్పుచున్నవి.

చిరం—చెబితే? ఏదో ధర్మకార్యాలకి నీవు నీడగా వుండాలని కాని యిలా ప్రాణంమీద ఆశలాడుండిపోతే ఎలాగ ఇహ నీవు నీడలాగులేవు. పీడలాగున్నావు. కుక్కముట్టుకు పోతుందేమోనని మడిపదార్థాలని కాచుకుతిరిగినట్లు తిరుగుతావన్నమాట. బాగుంది. పద, పద – ఎంత పాపిష్ఠి జన్మరా భగవంతామగవాడిది. ఏదో ఒకరి కొకరు అవసరం తీర్చుకుందుకుగాని యిలా అయితే యెలాగ? చూడు అక్కడనువ్వేమీనోల్లుకో నక్క స్లేమ. మెల్లిగా చెబుతున్నావిను. లేకపోతే తెలుసా! శేమగవాణ్ని. పీకనులిపి గోతులో పాతిపెట్టిమరీపో తాను. చీకటిసందుగదా. పిట్టమనిషైనా లేరిక్కడ. గురువుగారు కూడా చాలదూరంవెళ్ళి పోయుంటారీ పాటికి – మరచిపోయినట్టున్నావు నా సంగతి నేనెవరో జ్ఞాపకముందా?

మాధురి—అహా. బాగా జ్ఞాపకముంది.

చ. మునునరహంతవైన గురుబోధపునీతసుసాధుశీలురుగా
మునికులపుంగవుల్గవు తమల్కడుమక్కువజూచుశిష్యులున్
ననుదరియింపబూనిన గుణాఢ్యులు నీతనువింకమీాయదే
కొనగొనిపెంతురోతునిమిగోత నెయుంతురొమీాయధేచ్ఛయే

చిరం—ఇలాయిదవ్యేముండను నేనేంజేసుకోవాలి? అందగూ ఇలాటివాళ్ళే అయితే మగవాడికికమరోహాపనసీ మజా అనీ చూడడమెలాగ? చాలమందికీ విద్యచేతగాదు.

కొ త్తలో యేముందోనని రుచులు మార్పుకు దేవు లాడ్డమేగాని ఇలాకాలికి ప్రేలులాకట్ట కట్టుకుపోతే యెలాగ? అయినా మధ్యకాలంలో వచ్చిన మార్పుకి మరితిరుగుండదు. ఆహా! ఐతేపోవూ? బ్రహ్మరాక్షసి లావుంది. మంచిమాటలుచెప్పీ, చాకిరీచేసీ, పగలూ రాత్రి పహరాతిరిగీ నన్ను వశ్యకుక్కంజేసి పారేస్తుంది. వెధవనల్లమందు అలవాటులాగు రోజురోజుకీ దీనిమీద మమకారం యెక్కువై పోతూంది. మధ్యమధ్యను ప్రేమించినదని వల్లోపడిపోయానేమో అని అనుమానంకూడా వేస్తూంది. మొదట్లో యిలాగుండేదికాదు. మొత్తంమీద గురువుగారి వుపదేశం రెండుతలల పాములావుంది. నాకు మమకారంవద్దని దానికిస్వార్థం వద్దనీచెప్పి యిద్దరికీ ముడిపెట్టారు. సాధనకోసం యిద్దరంసాగుతున్నాము. కానైతే ఆడదిగనక ముందు తేలిపోయింది. మగముండావాణ్ణి నాకెలా వీలవు తుంది! ఇహ వేరుగాబోయి తపస్సు చేసుకుని సాధింతా మంటే తాడుతో డబ్బనంవలె తప్పీదారి కనపడదు! సరే. (దూరమునచూచి) అమ్మోపులిమింగేస్తుంది. (మాధురి వెనుదిరిగి చూడబోవ ఆపెను తిరగద్రోసి పారిపోవును.)

తెర పడు ను.

# పాషాణి

చతుర్థాంకము—ఒకటవ రంగము.

[హిమవత్పర్వత ప్రాంతారణ్యమున నేకాంతముగ]

అహల్య—ఆహా! పల్లెలు, పట్టణములు. యెన్ని తిరిగినను సుఖము శూన్యమేకదా. మధుమైకములోగూడ అరమూతపడిన నాకన్నులకు చెరుపు సుగుపువలె భయంకరపాపపిశాచి యగుపించి నోరు దెరచుకొని వెంపించుచున్నదే. నా శతానందుని చంపుకొంటిని అనా కుమారుడు చేతులెత్తి నన్ను పిలచి యేడ్చుచున్నాడు ప్రాణభిక్ష పెట్టుమనుచున్నాడు. అదుగో అమ్మాయని పిలచుచున్నాడు. ఉహూ భ్రమపడితిని. (నుంల నిదానముగలిగి) భ్రమకాదు. నిజముగ అదుగో పిలచుచున్నాడు. పాతాళమునుండి కాదు. అంతరాళమునుండి, సకలరోదసీ ముఖములనుండి. అబ్బ (కన్నులు మూసుకొని) పట్టపగటి వెలుగుకన్న స్పష్టమై-నిశిమసలు చీకటికన్న చిక్కనై కొండలు పగల్చు మిన్ను విరుపునుండి వినవచ్చుచున్నది. అమ్మా - మరల పిలచితివటయ్యా. అదుగో కుమారుని అంతిమరోద

నము నిన్ను చంపుకొంటినయ్యా. కాముకినై కన్నులు మూసుకొంటిగాని మాతృత్వము మసికాలేదయ్యా - మరల పిలచితివా? వచ్చుచున్నాను. ఇదిగో కానిముందు నకు నా కలుషహృదయరక్తము నొలకబోసుకొని నా పైశాచికయుద్వేగము నిర్వేగము చేసుకొని మరీ వత్తును. ఏదీ నాకటారి (మొలతడవి కటారి తీసియెత్తిపట్టి) నీవేనా పాపప్రాయశ్చిత్తకర్తవు. నిర్దాక్షిణ్యముగ హృత్పిండ మురలిపూడిపడ పాప భూయిష్టమైన యీ నా అహల్యా నామాక్షరములు పొలితిలేకుండ కడుగుకొనిపోవ ప్రవహించు నా నులి వెచ్చని నెత్తురు చిత్తుగద్రావి నన్నుద్ధరించుమా. ఓనా ప్రియశస్త్రమా. (పొడుచుకొన నుద్యుక్తకాగా వెనుక నుండి యింద్రుడా చేయిపట్టికొని) ఇంద్రుడు.

గీ. కొమ్మ హృదయవ్యథనడంప కమ్మనైన
మధువునరినుండ చేతికాయుధమదేల!
కొమ్మగ్రుక్కెడు మధువు క్షణమ్ములోన
జీవితముమరల మధురమ్మై చివురువోయు.

(బలవంతముగ త్రావింప త్రాగి కొంతదూరము తలగి)

అహల్య—అబ్బ. ఇంతకాలమునకు వచ్చితివా? అలుకతీరి నదా! సరెకాని అంత వాడియుంటివేమి?

ఇం—వాడియుండ లేదు.

అహల్య—అఁహా. లేకేమి? అగుపడుచునేయున్నది. అదిగో కాని, పూత మాయని ప్రకృతి - ప్రీతితీరని తారా చంద్రులు. అంతవాడిపోవు నవస్థయేల? నాటి మధుర నిశి......

ఇం—నాటిమాటేల? నేడు నీకొక దారుణవార్త తెలుప వచ్చితిని.

అహల్య—దారుణవార్తయా? నాకు తెలుపనా? ఏమది?

ఇం—నేడే నేస్వర్గమునకు పోవుచున్నాను - మరిరాను.

అహల్య—స్వర్గమునకా? వేరెస్వర్గమా! చేయిచేయిగలుపు కొని తనువులు పెనవైచుకొని విహరించు మనకు యిదే స్వర్గము. వేరె స్వర్గమునకు నేనురాను.

ఇం—ఔను. నీవు రానేవలదు. నేనొక్కడనే పోవుదును.

అహల్య—ఏకతమునపోవుటయా, యేకతమునసే - అబ్బ - మరి నేనో?

ఇం—నీవు మీయాశ్రమమునకుపొమ్ము.

అహల్య—మాయాశ్రమమునకా? చాలు చాలు. హాస్యము నకు హద్దుండవలెను.

ఇం—హాస్యముకాదు. అహల్యా - యదార్థమునే చెప్పు చున్నాను. బోధపడినదా?

అహల్య—యదార్థమా? నాకేమియు బోధపడలేదు.

ఇం—బోధపడనేలేదా? ఐన స్పష్టముగా చెప్పుచున్నాను విను.

క. తీరినది ప్రీతినీయెడ
ఆరెనులాలసయు హృదమందిక నే నా
దారింబోయెద నీవును
చేరుమునీయిష్టమెచట చేరన్ తలపో.

అహల్య—యేమాయన్నది. ప్రీతితీరిపోయెనా! లాలస ఆరిపోయెనా? ఇది సంభవమా? కలగనుచున్నానా లేక సంచలించుచున్నదా నాబుద్ధి! ఇంద్రా! నాలో నట్టి మార్పేమియు లేదే - ప్రేమతరుగునట! నీవింద్రుడవు కావా? నాప్రేమ......

ఇం—నేనింద్రుడనె. కాని ప్రేమయనుచున్నావే. అదెక్కడి ప్రేమ?

గీ. యవ్వనపుపొంగువాసనలైన ప్రణయ
మారిపోవదె లాలసతీరిపోవ?
భంగమెరుగనిహృదయము రంగరింప
పెరుగువిరుగు లెరుంగని ప్రేమయొలుకు.

అహల్య—ఐన నీపడినపాట్లన్నియు నన్ను మోసగించుటకేనా! నీహృదయమున కిందు పాలులేదా? నాహృదయము మాత్రము చూర్ణముచేసిపోదువా? ఏల యేడ్పించెదవు!

ఇం—నే నేడ్పించుటయేమి? నాకొరకు నిన్నేడువమంటినా! పోనీ యిప్పుడైన యేడ్పుమాని గౌతమునియొద్దకు పొమ్ము.

అహల్య—(అదరిపడి) యేమాయన్నది- గౌతముడా అమ్మో! ఆపవిత్ర నామాక్షరములచ్చరించిన మన జిహ్వాలు

దహించుకొనిపోవును. నీకును సుఖము దూరమగును. అచటకి నన్ను పొమ్మనకుము. ఈ యెంగిలిమంగళ మూదేవతావేదికపై దాపకుము. ఘోరమగు నీపై శౌచికవర్తనమచట కిట్టకనేకాదా నీచేయూతగొని యీనరకమున కురికివచ్చితిని. ఏనాడో పోయినది నాకాపుణ్యప్రదేశప్రవేశార్హత.

ఇం—అహల్యా...విను...

అహల్య—అహా - వినుటకేమున్నది. ఆనాడు ఆమరణ పర్యంతమును, నీయండచూచుకొని ఆయాశ్రమమునకు - ఆపతిసౌభాగ్యమునకు ఆపవిత్రజీవితమునకు - తిలాంజలినిచ్చితిని. అట్లుచేయుట కెంతతహతహపడితిని! నిన్ను మనసారప్రేమించితిని - తృప్తిదీర ప్రేమించుచుంటిని - జీవితమిట్లే కడతేర ప్రేమింపనుంటిని. ఇదిగో—

ఇం—ప్రేమ ప్రేమయని పెద్దగా చెప్పుచున్నావు. త్రిలోకాధినాథుడనైన మహేంద్రుడను - నిన్ను - ఒక మానవకాంతను ప్రేమించుటయా - అసంభవము - పరిహాసము.

అహల్య—ఇదియా! ఐన నన్నేలచెరచితివి? కులకాంతనే - ప్రేమమయుజీవినే. మహేంద్రుడనని మచ్చరించి నన్ను మోసగింతువా! ఇదే నీకు ఘనమా! అన్నియు నీకై త్యజించిన అబలయెడల నింత యహంకరించి యలుసు చేయకుము. జయముగాదు.

ఇం—ఓయి మదపిచ్చి మల్లీ - చెల్లపంక నీయాటలు. నే పోయెదను.

అహల్య—(చేయిపట్టుకొనిబోవుచు) - దేవేంద్రా చూడు నా యువ్వనపాత్రము౽ మధువింకను వట్టిపోలేదే - ఇంకను కావలసినంత మధువుగలదు. రమ్ము (చేయిపట్టుకొనును)

ఇం—ఛీ - నన్ను ముట్టకు. (చేయి విదలించి తొలగును)

అహల్య—అబ్బ! యింతవరకు వచ్చినదా - పొమ్ము దేవేంద్రా స్వర్గమునకే పొమ్ము. ఇదిగో యీ వ్యధికరణపరిణామము నీవు కన్నుమూసినను తెరచినను నీరక్తము లోని ప్రతికణమునందును అణువై నీడాపిశాచమువలె ముచ్చెమటలు క్రమ్మ మూడులోకముల దేవురించినను నిన్ను మూలమట్టముచేయక విడువదు. పొమ్ము.

ఇం—ఇక బెదరింపులా, అహ్హాహ్హాహా! మహారాజువలె పోవు చున్నాను. (వెనుదిరిగి పోవనిలుచును.)

అహల్య—ఆఁ - ధూర్తుడా. యెచటికి పోవుదువు? మరల యేపతివ్రతనైన చెరుపబోయెదవా? సిగ్గుమాలినమిండడా - నాకీపాప పంకముపూతవెట్టి పెండ్లికొడుకువలె నీవు పోవుదువా! నీ వుండరాదు. సురపతివని యచ్చువోసి విడువబడిన మొండిపశువా - నీ విచ్చలవిడికి నే నిచ్చు నీబహుమానము పుచ్చుకొని మరియుపొమ్ము. ఇదిగో (కటారితో వీపున పొడుచును.)

ఇం—ఓహో! పిశాచీ! అబ్బా - (తిరుగబడిపోవును)

అహల్య—అహ్హాహ్హా! తగినబహుమానము. నీపాపము పండి నది. ఇక నా ప్రతి హింసనిండవలయును. పాపనిచంపిన పాపపుచేతులను నీరక్తముతో కడుగుకొందును. చాలు నాబహుమతి! (వీరావేశముతో అదే పనిగా శరీరమున పలుచోట్ల కఠారితోపొడిచి, చేతులు తుడుచుకొనుచు) చక్కని బహుమానము. నీబ్రతుకున కిదియే స్వర్గము. ఇచ్చటనే క్రుళ్ళిచావుము. అహ్హాహ్హా. అమరుడవు. చావవు. క్రుళ్ళి నీశరీరమున యీశతసహస్రచ్ఛిద్రముల చిహ్నములును శాశ్వతముగా సాక్ష్యమిచ్చుచుండు నులే. (శిలపై కాలుతాటించి) నీ లాలనతీరిన దవ్వాడు గాదు. ఇప్పుడు. అయినది. స్వర్గాధిపత్యము పథ్య ముగా నిచ్చితిని. (వ్యంగముగా నవ్వుచు) దేవేంద్రా! అనుభవించుచుండుము. కోరమాలిన పురుగును. ఆడు దానను ఏమిచేయగలను. ఇక చేరెద నాయిష్టమెచట చేరంగలనో! (పిచ్చిగాచూచుచు నిష్క్రమించును.)

[చిరంజీవి ప్రవేశించి]

చిరం—గురువుగారూ! గురువుగారూ! వేగంరండీ. ఎవరో పడి పోయారు? నెన్నిగోతులాడిలా వొంటినిండా కత్తి పోట్లే. పిలిచినా చచ్చినాడు పలుకలేదండీ. కదపకుండా కదల్లేదండీ.

గౌత—(ఆత్రముగా ప్రవేశించి నాడిపరికించి) చిరంజీవా. యెవరో పాపము. చచ్చిపోలేదు. ఆశ్రమములోపరుండ

బెట్టి సేవచేసిన తెలివిగొనును. చచ్చిపోడు. నిలుకడ మీాద బాగుపడును. రమ్ము. ఆశ్రమములోనికి తీసుకొనిపోదము. (ఇరువురును చెరియొక ప్రక్కను యెత్తి తీసుకొనిపోవుట. చిరంజీవి కాళ్లుపట్టి మొయ్యలేనట్లు జార్చి) అబ్బ చచ్చినగేదెపెయ్యలా యెంతబరువున్నాడు బండాముండాకొడుకు. (నిష్క్రమింతురు.)

తె ర ప డు ను.

---

## చతుర్థాంకము — రెండవ రంగము.

[మిథిలోపాంతమున ఉన్మాదిని యహల్య.]

అదిగో మిథిల. యెంతలేసిహర్మ్యములు? అబ్బ - యెందుకో అనుకున్నాను యీావైభవమంతా- ఆడవాళ్ళనాకర్షించడానికే - మోసపుచ్చడానికే - అన్నీ పాపకర్మశాలలు. ఇక నేమోసపోను. ఆమేడల్లో వుంటారు ఘనులు - బూటకపుగనులు - అహంకారధనులు - డంబస్వార్థప్రతిహింసలే వీళ్ళపనులు - వీళ్ళ భయంకర హృదయగుహాల అంధకారం ఛేదించే ఆయుధంలేక చుట్టుచుట్టూదిరిగి చచ్చిపోతున్నాడు పాపం సూర్యుడు.. ఆమగపశువులు తిరిగేమరుగులకు నేనెందుకెళ్ళాలి; అమ్మో వాళ్ళకెంతగొప్ప! ఆడదానిచూపులట- అతి నిశితములట. అఘోరించి అడుక్కుతిన్న ట్లేవుంది

సిద్ధాంతం. వీరి పాపిష్టికండ్లకున్న వాడి పచ్చికండలు చీల్చుకుతినే పెద్దపులి పండ్లకుందీ - ఆరిభడవా! సిగ్గా కన్నుకొడుతున్నావా? నీకూ నేనలుసే - తెలుసు నీనాటకం. (గాలికికొట్టుకొను నొక యెండుకొమ్మను విసురుగా గుంజి పెరికి) ఐందా! నీరెపరెప. అణగింగా నీమొనగానితనం. (నేలపై విసరి) క్రిందపడి యేడుస్తా వెందుకు? సరసం సరా? (మరల ఆకొమ్మను తీసుకొని) నిన్ను పుట్టించిన బ్రహ్మకే లేదు నీతి. కన్నెధాన్యాల మాతల్లి గారికి కన్నుకొట్టాడు. ఐతే "పంచశరవంచన మివ" అని శిరంయెగిరిపోతే కుదిరింపరోగం. నూవ్యాం అంతే జపంజేసుకుంటూ కూర్చోవేమూల. కూతురిని ప్రతివాడూ యెంగిలిచేసినదానిని యేలుకొన్న లోలుడైనా నిన్నంటే దైవదూషణ. తప్పు పెద్దింటికడవడికి దిద్దుబాట్లు చెయ్యరాదు. నాబోటి అపూర్వయిసొ అనామకురాలినైతే అడిపోసుకోగలరు. నేను న్యభి చారినని అంతగోలెందుకు? (నిదానించిచూచి) బ్రహ్మ గోలకాదూ. కుర్రకుంకలగోలా? సరే——

[మీనయ్య కూర్మయ్య ప్రవేశం.]

(మీనయ్య బక్క-వాడు. కూర్మయ్య స్థూలకాయుడు)

కూర్మయ్య——ఎలరుచెప్పారయ్యా? ఆకాశమంత అబద్ధం.

మీనయ్య——కాదయ్య - బొంకంతనిజము - స్వయం శత నందులవారి ముఖతగవిన్నాఅంటే - బ్రహ్మముఖాల వేదములవలెనన్నమాట.

కూర్మయ్య—అతడెవరయ్యా? అంతగొప్పచేసి చెబుతున్నావు.

మీనయ్య—మన జనకమహారాజులుంగారి పురోహితులోయ్ గౌతమఋషి పుత్రులు.

కూర్మయ్య—అయితే యెప్పుడు చెప్పారయ్యా?

మీనయ్య—నిన్నమధ్యాహ్నకాలమున - అదిగో సీతాస్వయంవరాని కంచరూ వచ్చేస్తున్నారు. భోజనాలకుముందు పోవాలి. సంభావనుంది (పారిపోవును)

కూర్మయ్య—హారివీడి తొందరయిదిగానూ, తుర్రున పారిపోయాడు - నేవడిగా పరిగెత్తలేను - నాసంభావన పోతుందోయేమో' విస్తళ్ళన్నీ నిండిపోతే నాకీవేళ కూడా ధప్పళంలేనిచప్పిడే - దాంతల్లిశిగ దరిగినకష్టం! పరుగుచ్చుకుంటాను నేనూను. (పరుగెత్తబోయిపడి నలుతట్లునుచూచి ఒళ్ళు దులుపుకొని పోవును)

అహల్య—ఏమి? సీతాస్వయంవరమా - నాశతనందుడేనా వీరన్నది. ఇక్కడనేయున్నాడా - పోతా - చూచుకుంటాను. నాశతానందుడు క్షేమముగానున్నచాలును. చూచుకుంటా - పరమాత్మా నన్ను క్షమించవూ నాకుమారుని నన్నుచూచుకోనీయవూ - నన్ను కరుణించవూ—

[మరియొకజట్టు అనాగతుడు అతీతుడు ప్రవేశము]

అనా—ఇహ చెప్పనక్కరలేదయ్యా - ధాత్రి కంతాధర్మావతారం ఇంద్రుడే.

అతీ—అంతటితో సరిపడదోయ్. పతివ్రతాశిఖాతిలకమణీ వతంసలలామమంటే అహల్యే—

అనా—అదేమిటదేమిటి? అన్ని శ్రేష్ఠవాచకా లెందుకోయ్?

అతీ—అంటే అసలుసున్నా అనడానికి అనంతశబ్దాడంబరము. పలుకుల కందని పరమేశ్వరుణ్ని - యోచనకందని యోగస్వరూపుణ్ణి నిరూపించడానికి నాలుగువేదాలు పద్దెనిమిదిపురాణాలు. అరవైనాలుగుకళలు. ఇన్నింటి సారంవున్నా శూన్యంవేగాదూ.

అనా—బాగుంది. కాని గౌతముడొస్తున్నాడు చూశావా. శవంలా యెలాగున్నాడో?

అతీ—శవంలాకాకపోతే జవంయెలా వస్తుంది? తగనినింద తరగ్గోసేస్తూంటే - ఆ భ్రష్ట - అహల్య.

అనా—వద్దువద్దు. ఆపేరెత్తకు. నోరాశౌచపడుతుంది.

అహల్య—(వారి కెదురువచ్చి నిలచి) యెవరయ్యా మీరు? మహాగట్టిగా తిడుతున్నారు నడివీధిని—

అనా—ఓరబ్బా! ఇదెక్కడి దెయ్యంరోయ్? చచ్చాంరా బాబూ. (పారిపోవును)

అతీ—కాదయ్యా - మనిషే వరదుముఖం చింపిరిజుత్తు. లోతుకుపోయినకళ్ళు. మట్టిలో పాతుకుపోయినవళ్ళు. ఇదీని. తన్నండి. (అహల్య పట్టుకొనబోవ దూర ముగా పారిపోవును.)

అహల్య—నేనాభ్రష్టను? నాచరిత్ర వినండి—

అనా——వినడ మేంటి దాని(శ్రాద్ధం. తన్ని తగిలీయండి (రాయి తోకొట్టును. అహల్య నొసటదగిలి చిల్లిపడి రక్తము ప్రవహించును.)

[శతానందుడు ప్రవేశించి]

శతా——ఆగండి. ఏమిటీయత్యాచారము ఆడుదానిపై ? యేమి చేసిందీమె?

అతీ——చెయ్యడమేంటి పిచ్చిముండ. తన్నితగిలేయక దగ్గిరి కెళ్ళకు. కరుస్తుందిజాగ్రత్త. (బాలురు నిష్క్రమింతురు)

శతా——ఎవరమ్మా నీవు?

అహల్య—నేనా ఆహల్యనే.

శతా——నీవహల్యవా? గౌతమునిభార్య! తపస్విని!

అహల్య——ఔను. కాని నీవెవరయ్యా?

శతా——ఇప్పుడిక్కడి కెందుకువచ్చావు?

అహల్య——నాశతానందుని చూడవలెనని. ఈపట్టణమునసే యున్నాడట——

శతా——శతానందునా? ఎందుకుచూచుట?

అహల్య—యెందుకా? యెందు కేమయ్యా. (నిదానించి స్మృతి నభినయించి) ఆఁ నీవు! నీవేకావూ. మాశతానందు డవు! ఔను అదేగొంతు. ఆముద్దుమొగమే——

శతా——ఐన నీ కేమికావలయును?

అహల్య——ఏమికావలెనా - నీవేకావలెనయ్యా - నన్నుకన్న తండ్రీ! తనివిదీర ఒక్కసారి కౌగలించి ముద్దుబెట్టుకో నీవూ. (చేతులుచాచి ముందుకు నడచుచు) ఊఁ——

శతా—ఆగుము. నీశతానందుడు లేడు - నీవాతని నపకీర్తి సముద్రమున పారవైచుకొంటివి. అతడు గంటిపోయి నాడు. ఇక తేలనే తేలలేడు. (దుఃఖముతో గొంతు గద్గదపోవ చేతులు జోడించి) తల్లి—

మ. తలఃసన్దల్లికి తండ్రికిన్ కడుపుకోతౌ నాత్మహత్యాని కసి
కులటాపుత్రుడన్న దుర్యశమహోత్క్రోశాగ్నిలో వ్రాలి ఘో
షిలియున్ కృంగికృశించి యేడ్చుకొనెదా జీవాంతమున్
చాలు నెం
దులకాశ్వాసన మాతృదేవి చనుమెందో నా ప్రణామంబిదే.

ఆవీధికొనను దేవాలయమున్నది - కారుమబ్బులు రానున్న మహావృష్టింగూర్చి గుబ్బెటలు పెట్టుకొనుచున్నవి. నాకు నిలువత్రాణ లేదు. క్షమించుము - త్వరపడుము. నేబోవలయును. (నిష్క్రమించును.)

అహల్య—(దీనముగా చూచుచు) ఆహా! తనబిడ్డకన్న పుత్రుండు హృదయమంతయును దయార్ద్రసమే - పరమాత్మా - ఇంత నిర్దాక్షిణ్యమూ నీసృష్టి? ఎంత విపరీతము! ఇంత నిష్ఠురమా! తల్లీ వసుంధరా, నీగుః జెపగిలి ద్రవింప లేదా? చలనమే లేదా? అబ్బా! (తలమోదుకొని) నేను పాతకినే యగుదును. కాని యెవరి దోషముఃలేక నాటి దుర్బలహృదయులను మోసగించిన వారికి దోషమే లేదా? నాయవ్వనమధురసమూలమును పీల్చి వట్టి పిప్పి నిర్దాక్షిణ్యముగా గిరవాటువైచిన కఠిన స్వార్థ

సరులనే సమర్థించు నాలోకము! (వర్షముపడును) ఆ ప్రకృతిపలికినది. కరిగినది. లోకమంతయు నింతే. దానితో నాకేమిపని. ఈలోకమున బ్రతుకనే బ్రతుకను. ఎవరికొరకు బ్రతుకుట. ఊహు- బ్రతుకను. కురియనీ ఉన్న వర్షమంతయు. కురిసి వరదై పాడులోకమంతయు కొట్టుకొనిపోనీ. నాకేం? నేను త్తముగాలనే యని ప్రకృతి పలికింది. చాలు ఇక బ్రతుకను. (పిచ్చిగాచూచుచు నిష్క్రమించును.)

తెర పడు ను.

## చతుర్థాంకము—మూడవ రంగము.

[హిమవన్నగ సానుతలమున గౌతముడును చిరంజీవియు]

గౌత—(హిమగిరి శృంగమును మహానందముగచూచుచు పులకితుడై) ఆహా!

మ. అతిలోకోన్నతమై వినీలపథవీనాగ్రంబునై ప్రోజ్వలత్
శతకోటీంద్ర ధనుష్కలాపరచితాశాపూర్ణ డింభోళియై
క్షితిచూడామణియైన యీహిమగిరి శృంగంబునగ్నాకృతిన్
గతపాపుల్కన నేర్తురన్ననుడి నిక్కంబౌటనే కాంచితిన్.

సార్థకమైనది నాజన్మ.

గీ. నిజసహజపద్ధతిని నరనేత్రమిట్టి
దృశ్యమును చూడగల్గెనే ఎన్న డేని?
శాంతము నితాంతదివ్య ప్రశాంతమయము
పలుకనేరను పరమాత్మ వందనంబు.

చిరంజీవా. నీ వే మాలోచించుచున్నావు?

చిరం—ఏమీ లేదండి. మీకీరుగ్మత యెలాకుదురుతుందా అని బుద్ధికుదిరి కుదుట్లో పడడమంటే సామాన్యమా. ఎటు బోయెటువచ్చినా వైద్యులేనాలేరు. పిలిచీవాళ్లైనా లేరు. మీదమీదుందా. నేను మిమ్మలినేం జేసుకోన్రా భగవంతా అని యాలోచిస్తున్నా—

గౌత—(నవ్వి) ఏమిటీభయము? జగదేకమోహనమైన యీ కైలాసశృంగదర్శనమున చీకుచింతలెల్ల చెల్లాచెదరులగుచుండ నీకీ చింతయేలేదే—

చిరం—ఏమిటీ? కైలాసశృంగం అంతఘట్టినాఅండీ. చిత్తం చిత్తం. అదేం ప్రారబ్ధమోగాని మీ సంస్కృతభాషా పాండిత్యపటిమకి పళ్ళుభయపడుతున్నాయి. చెవులు చిదికిపోతున్నాయి. కొరకరాని కొయ్యనాటవు ఈ దేవుళ్ళాలభాష పట్టుకున్నారిదేమిటండీ. ఇదేంబాధండీ.

[ఇంద్రుడు ప్రవేశించును.]

గౌత—ఇచ్చట కేలవచ్చితివి నాయనా! ఆశ్రమము విడచి—

ఇం—పోవతలంపు కలిగినది. శక్తి యెంతకూడినదో చూచుకొనవచ్చితిని.

గౌత—కాదునాయనా యింకను రెండురోజులు విశ్రాంతి తీసుకొని పోవచ్చును.

ఇం—పోగలను. కాని తమ పవిత్రనామము తెలిపిన యేదో పురష్కారము సమర్పించుకొని యెల్లకాలమును స్మరించుకొందును.

చిరం—పురస్కారమే. యేమిస్తావో చెప్పు? నే చెప్తాను.

గౌత—చిరంజీవా! తప్పు. (ఇంద్రునితో) వలదు నాయనా. నాకేమియు వలదు. ఏదియు కొదవలేదు.

ఇం—పోనిండు. నామము?

గౌత—గౌతముడందురు.

ఇం—(అదరిపడి) మిథిలోపాంతవాసులు - తాము.

గౌత—నాయనా! గాయములు పూర్తిగ మానినవా?

చిరం—(హేళనగా) గాయాలుమానినా మచ్చలు మిగిలిపోయి చిరుతపులిలావున్నాడు. ఇంటికెళితే పాపం పోల్చలేరు.

గౌత—తప్పు చిరంజీవా.

చిరం—కాదండీ యెంతటక్కరినటనో చూడండి. మిమ్ములను యెరగడేమోగాని నన్నెరిగేవుండొచ్చు.

ఇం—పరమఋషీ నేనెవరో తామెరుగుదురా?

గౌత—ఎరుగుదును. సురపతివి - దేవేంద్రుడవు.

చిరం—అంతేకాదు. అహల్యాదేవిగారిప్రేమాధిపతివి-ఉపపతివి.

ఇం—ఎవరన్నారు? ఎప్పుడు?

గౌత—నీ! వేప్రలాపనావస్థయందు.

చిరం—నిన్నప్పుడే తుదముట్టించియుందును. అక్కడ పడివున్న నిన్నుకదల్లేకపోతే మోసుగురావలసికూడా

వచ్చింది గురువుగారి స్వాతిక సిద్ధాంతసూత్ర విస్ఫోట
నై పోయి.

ఇం—(వణకుచు గౌతముని పాదములకెరగి) మహాత్మా!

చ. పలువిధపాపముల్గలవు వానికినీనిష్కృతులైన శిక్షలున్
గలుగును కాని నాదురితకర్మకు చాలినశిక్ష పారమూ
నలువయె తెల్పనేరడన నన్ను క్షమించుటయన్న నల్లను
ప్వలితమువశ్యభోగ్యము! కృపానిధి! నాదురవస్థగాంచవే.

చిరం—పోరా పోకిరీ – నీయాలితానూ దిట్టమైంది కాబట్టి
ఉట్టినేపోయింది.

గౌత—ఏమది? చిరంజీవా! హేళన దేనికి?

ఇం—చ. నలిపితిఘోరపాపము విశంకటవృత్తిని నేడు నీమహో
జ్జ్వలపరతత్త్వదీధితుల భావిభయంకరభంగి యెల్ల క
న్నులకడ తాండవించె కృపణుండను ఈపరితాపవహ్ని
జ్వాలహృదయున్ క్షమించి దయ పాలనజేసెదొ పాప
ద్రోలెనో.

గౌత—దేవేంద్రా! నామనమునలేశమైని నీపట్ల ద్వేషము
లేదు. నీ మేనగల యావికారపుమచ్చలుగూడ చూచు
వారికి విస్మృతముగ గన్పడకుండుగాక యని నామనసార
కోరగలను.

చిరం—మరిహా నేం! బతే గండం గడిచావు పారిపో. యింకా
చూస్తావేం?

గౌత—తప్పు చిరంజీవా! దేవేంద్రా! సర్వలోకములను క్షమింప
గలవాడు పరమేశ్వరుడు. ఆదయాపరునే శరణువేడుము

ఆ సమర్థుడు నీమనసునగల కలతనెల్ల దీర్పగలడు. నేనా పేద బాపడను. నీకు శుభముగుగాక యని ఆశీస్సుతప్ప యేమియీయగలను. నీవిక యథేచ్ఛగపొమ్ము.

(ఇంద్రుడు నిష్క్రమించును.)

చిరం—గురువుగారూ! మీరుచేసినపని నాకేం నచ్చలేదు. నేనైతేనా, వీకి పిడికిట్లో కిరికించుకొని జోడుతీసి అట్టలూడిపోయేవరకూ కొట్టి మరీతీరుదును. ఇదుగో ఆకలితో బాధపడడానికి ఒళ్ళుమాత్రం విడిచి - చూడ్డానికి కళ్ళుగాని - వినడానికి చెవులుగాని - నమలడానికి పళ్ళుగాని మింగడానికంగిలిగాని లేకుండా ముద్దచేసి మరీ వీడిచిపెట్టుదును.

గౌత—అదికాదు నాయనా!

ఉ. కోపమెశత్రువై మనకుగూర్చును పాపము పాపకర్మలన్
చేపడు కష్టసంచయము చెచ్చరకష్టచయంబులాత్మకే
యొాపివినాశకారియగు నూరక ఆత్మవిహీనుసత్కృపన్
జూపి క్షమించిపుచ్చునదె నూవెమహత్తరమైన బోధయా
తప్పుచేసిన బుద్ధినిదండింపవలెగాని యింద్రియములనాశిక్షించుట. శాంతముతో దురితము నీరగును చిరంజీవా.

చిరం—గురువుగారూ మీధోరణి నాకుబోధపడదు. కాని మనుష్యులపట్లనైతే యేమోగాని పశువులయెడల పనికిరాదని నామనవి.

గౌత—అయ్యయ్యో! ప్రకృతిరూప భేదమేగాని తత్వమొకటియే. మానవునియందు పశుత్వమునుగలదు. మాన

వత్వమునుగలదు. ఆ మానవత్వపు గుణ శ్రేష్ఠము.
ఇదియే పశుత్వమును జయింపగలది.

చిరం—మీభాష, భావమూ నాకా కాశపురాణమైపోతూంది.

[రాజదూత ప్రవేశించి]

గౌతమమహర్షి యాశ్రమమిదియేనా?

చిరం—నువ్వెవరోయి. ఆకాశంలోంచి ఊడిపడ్డావేంటి? ఊం వారేగురువుగారు. (వినయముతో దూత నమస్కరించి శ్రీముఖమీయ గౌతముడందుకొని చదువుచు సంతోషము వెలిబుచ్చును)

గౌత—చిరంజీవా, సీతాస్వయంవరము. మనల నాహ్వానించినారు. భద్రుడా నీవు చాల శ్రమపడితివి. విశ్రాంతి గొనుము – చిరంజీవా యీతనికి ఫలాహారము నొసంగుము. (దూతయు చిరంజీవియు నిష్క్రమింతురు.)

ఆహ—గీ. సీత జనకాఖ్యజ్ఞాన ప్రసూతలోక
మాతగానున్నది అయోనిజాత నేను
లోకకల్యాణ మట్టిదాలోకనీయ
మగుట నాజన్మ సార్థకమగుట నిజము.

తె ర ప డు ను.

---

## చతుర్థాంకము—నాల్గవ రంగము.

[గౌతమాశ్రమ పరిసరమున బాటసారులై విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు.]

లక్ష్మ—రామా! అపుణ్యుని యాశ్రమమిదియేనా?

విశ్వా—ఔను. నాడిది కేవలము స్వర్గమునకు ప్రతిమానముగ నుండెడిది. ప్రేమాకాశమున ఆపుణ్యదంపతులు చంద్రచంద్రికలవలె నయనానందకరులై యుండిరి. కడసారి వారినిచ్చట చూచిన యాచల్లనిదృశ్యమిప్పటికిని నామనోవీధిని మాయలేదు. వారి యభిన్నస్వరములు వీణా మృదంగనాదయుతులై జగన్మోహనముగ నుండినవి.

(ఏదోబరువగు పదార్థము జరిగిన శబ్దము)

రామలక్ష్మ—ఏమా చప్పుడు (లక్ష్మణునితో)

రాముడు—లక్ష్మణా! ఆచెట్టుమొదట నేదో శిలాప్రతిమ జారినట్లున్నది చూడుమా!

లక్ష్మ—ప్రతిమకాదు - శవమువలెనున్నది. (ముందుకునడచి చూచి) ఊఁహు! శవముకాదు జీవమున్నది. కదలుచున్నది. అదుగో కనులు విచ్చుచున్నది. యెవరో స్త్రీ!

విశ్వా—ఈమె అహల్యకాదూ? ఇచ్చటనున్నావేమి?

అహల్య—ఔను. నేనహల్యనే - మీరెవరు? యెరిగివున్న గొంతులావుందే!

విశ్వా—పోల్చగలవా! నేను విశ్వామిత్రుడను.

అహల్య—ఓహో! మీరా – సుఖవిశ్వామిత్రులు. సందేహం లేదు. మళ్ళీ యిలావచ్చారేం!

విశ్వా—(నవ్వుచు) అతిథులము.

అహల్య—(శతాయించునట్లుతలనూపి) అతిథులా? అతిథులగా అవాంవాళ్ళలున్నా ఎవరికీ తెనులు? నాకనాల్గితెలు. ఆడుదాన్నొక్కర్తెనే ఉన్నాను. పోండు. పోండు. అతిథులమనిహో వత్తురు.

విశ్వా—ఇదియేమి విపరీతము? ఎన్నడును ఇట్లాడియుండలేదే మున్నన్న సుకుమార లజ్జాభంగిమము లేమైపోయినవి! ఆమందహాస చంద్రిక లేమై పోయినవి? ఎండ, వాన, ఆకలి, దప్పి, నిద్ర, విశ్రాంతి, యేమియులేక నష్టమై తనువు శిలాసదృశమై పోయినదే.

అహల్య—చాలు నీవర్ణన! నీమనసు కెనరనుకొన్నావు? అవస్న నట్టి పోయినా యీశక్తికి. ఈనిర్జనారణ్యంలో కూడా నన్నెందుకు వేధిస్తారు? మీవెవ్వరిసుఖానికీ పనికి రాను. చిల్లిగవ్వవిలునైనా నావద్ద లేదు మీకివ్వాలంటే మునుపెప్పుడైనా మీరు ఋషీశ్వరులని గౌరవించినా వెర్రిదాన్నై గౌరవించుంటాను. ఇవాళివ్వాళింక పిస రైనాలేదు. పొండిపొండి మీపోకిళ్ళకి పోగాలంరానూ.

విశ్వా—ఏమమ్మా – నాదోషమేమి?

అహల్య—దోషమా, యింకాసిగ్గులేక యేందోషమని అడుగు తున్నారా! అంతాదోషమే. మగవీడలంతావకటే –

పచ్చనిశీలవృక్షానికీ చీడపేలెందుకు సృష్టించేడో భగవంతుడు - మీరూ ఋషులమన్నారనరే - సన్యాసులమన్నారనరే - ఇక మోసపోను - మీరూ మీవేషాలున్నా - నేనెరుగుదును. అతిధులట - యతులట. మీయెత్తులునమ్మి మతిపోగొట్టుకొనే వెర్రివాళ్ళెవళ్ళూ లేరిక్కడ. చాలు చాలు అంతామోసమే—

విశ్వా—అహల్యా! మేము నిన్నిపుడు మోసగించుటకు రాలేదు.

అహల్య—ఇహచాలు. వెళ్ళండి. మీమగవారిని నమ్మడమెట్లు? అజాగ్రత్తనున్న అబలలకుత్తుకలు త్తరించగలరు భక్తిస్నేహములను పశువాంఛకు బలిచేయగలరు. ఆచారపదఘట్టనలతో అనురాగహృదయకుసుమాలను నలిపివేయగలరు. ఆకొన్ననోట అగ్గిని - దాహమన్న గొంతులో హాలాహలమును బహునేర్పుగా పోయగలరు. మీమగవారుచేచేతుల చేయలేని ద్రోహమేముంది?

రాముడు—బాగుబాగు. వెర్రిబాగుల తపస్వినీ - పురుషప్రకృతియన్న నింతటి యసహ్యమొందితివా? నీతిరస్కృతహృదయవేదన విమర్శవాజ్ఞానదీపము నార్పివేయవైచినదే!

చ. బహువిధవాసనా వ్యసనవాయుతరంగిత జీవితంబునందు
హితముగా గనంబడిన దూషితరక్తికి చిక్కి తూచనా

రహితముగా చరించియుల ప్రాక్తనమనుష్యులలోకిన్ జాలంబుచే
డహితమటన్న తప్పునదె యందుకుమారుడు పాపసర్పకుండిన్.
దుష్కార్యము లన్నిటికీ ప్రాయశ్చిత్తములున్నవి.

లక్ష్మి—అమ్మా. పరిణామము విమర్శించుకొనక ప్రారంభించి నప్పుడు ఏమగును.

గీ. సులభమని యెదుటి ముషిడిని వలచి తెచ్చి
నాటి యవివేకమున పెంచినావు నేడు
తీయమామిడి పండ్లియదేనటంచు
వెగటుపడి విధితో నేల జగడమాడ?

రాముడు—అమ్మా? తప్పుచేయుట యెల్లరకున్నదే. పెద్దలుంచిన నీతులలోని యాంతర్యమెఱుంగ నేరక చెడుగునకే చేయిచాచుట యెవరిలోపము. ఈమానసిక ప్రవృత్తుల నిగ్రహించుటలో నెంతేని మెలకువతో ప్రవర్తింప వలయును.

చ. వయసనుపూతతో ప్రణయ వాసనలుప్పతిలంగ దానికిం
ద్రియములతోడు కూడికదు తీవ్రతతో చెలరేగు నాదని
నియమము లేని వెల్లువటు నిల్కడకోల్పడి నాశనంబును
లయపరిణామమార్గము తొలంగక పోవుట లోకలోపమే.

లక్ష్మి—ఓయమ్మా.

చ. జగమున జన్మగాంచుటన చల్లగ మొత్తని పూలపాన్పుపై
నెగడిసుఖింపగాదు పృథునిర్మల శీలము కాచుకొంటకై
తెగపడి పోరగావలయు ధీరతతో నరివర్గము క్తినే
ర్పుగ నెదిరించి కాచు కొనబోలును ధర్మము వీడ చెల్లుచే.

అహల్య—(కనులె త్తి దీనముగ) అబ్బ! యేమయ్యా యిదియబలలకు సాధ్యమా. ఆడుదానను నాకంతటి శక్తియుండవలదా?

రాముడు—వెఱ్ఱితల్లీ నీవేశక్తివి. నీకుశక్తియుండుటేమి. లేకుండుటేమి. సకల ప్రకృతికిని మాతృశక్తివైన నీవే శక్తిలేదని యూరకున్న భావిసృష్టియంతయు భగ్నమై పోదా? సత్కర్మకైనను దుష్కర్మకైనను శక్తి యొక్కటియే ఆశక్తి యెట్టి కర్మాసక్తమగునో తదనుగుణమగు ఫలమేకలుగును. కాని యిప్పుడు ముఖ్యముగ గావలసినది శక్తిగాదు. ఇచ్ఛ - ఆసక్తి. అది సత్కర్మలకున్ముఖత చెందవలెను.

మ. చెలువానీపశువాసనా కలుషహృత్క్షేత్రంబు పశ్చాత్తప్తో
జ్వలప్రక్రియగాల్చి వైచి తిరుగ౯ సత్కర్మబీజంబులన్
వెలయన్నాటుము నీమనోవిభు కృపాదీక్షా! సుధావృష్టితో
గలుగన్గల్గు నితోధిక ప్రగతిసాకల్యంబుగా నీపయిన్.

అ—ఇపుడది సాధ్యమేనయ్యా? నాతండ్రీ యేమయ్యా నీయుపదేశమాధుర్యము నీవు మానవమాత్రుడవుగా గన్పడవు. దేవుడవు - నీయమృతవాక్కులకు నాయాశాలత పల్లవించినది. కాని, పురుషోత్తమా, నిందాప్రమాదముననిట్టి మల్లి నాటితినే - యీమరుభూమిలోనిది వర్ధిల్లుటకు నీరేది - విస్తరిలుటకు విశాలతయేదీ - నీదివ్యపదస్పర్శ నా శిథిలహృదయతంతులకు జీవమిచ్చినది.

నీజ్ఞానబోధ నాపాపతిమిరమును పటాపంచలుచేసినది. నీసత్యనిర్వచనము నిజముగ సత్యాత్మకము. విశ్వామిత్రా! యీజ్ఞానవటుమూర్తి యెవ్వరయా!

రాముడు—నేను రాముడను. యీతడు నాసోదరుడు లక్ష్మణుడు. దశరథపుత్రులము.

అహల్య—రామచంద్రమూర్తీ నీవేనా వైనముచస్వా! అహో యిక తరించగలను అను నమ్మిక నన్నూరించుచున్నది. 'హరేరామ హరేరామ రామరామ హరేహరే' విశ్వామిత్రముని సత్తమా! యిట్టి జ్ఞానరత్నములకల వాడటయ్యా దశరథుడు ఆనాడు నన్ను బెదిరించుట కంటివి నట్టి రాజురాల్పైకదా యనుకొంటిని. రామా నన్నాశీర్వదింపుము. రక్షించుముతండ్రీ. అహో యిప్పటికి ధన్యను- దేవతలారా నన్ననుగ్రహించి యాతిథ్యమంగీకరింపరా!

రాముడు—పుణ్యమయీ, నీభక్తివిశ్వాసములకు పరితృప్తులమైతిమి. నీహార్దికాదరము మాకానందపువిందుగూర్చినది. (నిష్క్రమింతురు.)

(తెరపడును.)



# పాషాణి



పంచమాంకము—ఒకటవ రంగము.

[ఇంద్రలోకమున ఏకాంతమందిరము.]

-(విషణ్ణుఁడై పచారుచేయుచు) అబ్బా, యెంతటి ఘోర పరిణామము! ఇచ్ఛగొలుపుచునుకొన్న యచ్చరల నృత్తగానాదికములు నామత్సరమునులికింపుచున్నవే.

సీ. మానభగ్నతపస్వినీనితాంత కృధాగ్ని
కణములో యనదీపగణముమందు
శీలాపహృతముని సింహినీగర్జితా
రవములో యనగానరవములడరు
వంచితకామినీ ప్రళయభైరవతాండ
గతులో యనగనృత్యగతులు దనరె
ప్రహసితప్రణయినీ వైరదావానలో
ద్ధూమమో యనన గరుధూమమడరె.

అరికో—

గీ. వికటప్రతిహింస నార్భటీ వివిధవిషమ
కఠినశిక్షాప్రకాండ సంఘటితచటుల

యాతనాప్రోతమై బ్రతుకవశమయ్యె
అకట అమరత్వమే నేడ నర్థమయ్యె.

పరాత్పరా క్షమింపవా? కల్ల. నీవల్ల నేమగును? క్షమసర్వస్వమును ఆగౌతముని యాధీనమైపోయినది. నీకు మిగిలినది శూన్యమే.

మ. అకటా నాయపరాధ దుష్ఫలితమూహాతీతసర్వాంగ తా
పక దావాగ్నివడిన్ దహించె కరుణాపారీణ నీదివ్య సా
త్వికతత్త్వామృతవృష్టిగాక నికశాంతిన్ గూర్పు నేయౌషధం
బు? కరంబెత్తి నమస్కరింతు దయతో బ్రోవంగ దే గౌతమా!

అనుగ్రహింపుము – నాయహంకారము బుగ్గియైనది. రాజసము చల్లారినది. నీనిష్కళంకజీవనప్రశాంత దీప్తులలో కడగండ్లగడచి మననిమ్ము—

(నేపథ్యమున దౌవారికుడు)

ప్రభూ! మహారాజ్ఞి శచీదేవిగారు దయచేయుచున్నారు.

ఇం—(సంభావించుకొని) దేవీ రమ్ము – రమ్ము.

శచి—అనుగ్రహించి – యవల తొలగుడు.

ఇం—దేవీ! ఇటుగాదా! వచ్చుచున్నది! రమ్ము.

శచి—చాలును. నాదోవనుండరాదు. తొలగవలయును. నీచమానవ సంపర్కకలుషితులకు పవిత్రపులోమసంతతి పేరుత్తుట కర్హతలేదు.

ఇం—దేవీ నీచమానవులేమి? నే నొసంగితిని యమరత్వము. ఇపుడామె అనుపమదివ్య సుందర సుధాంశమయూఖము,

శచి—చాలును. అమరత్వమంత సులభముగాదు. మీరిచ్చి
నంత మాత్రమున వచ్చునదిగాదు. వచ్చినను రాదు.

ఇం—ప్రియే నామాట పూర్తిగ వినవలయును. ఆ...

శచి—చాలును విననక్కరలేదు. ఆమెకు వచ్చినదిలేదు. మీ
రిచ్చుటచేత. గానిమీనీచపశుప్రవృత్తియు అతృప్త
లాలసయు మీకుమానుషత్వమిచ్చి యధమపదమున
నిల్పినది. ఇదిమాత్రము మీకువచ్చినది. (నిష్క్ర)

ఇం—ఔరా పోయినది. సర్వమును బూడిదలో నొలికిపోయి
నది. విశ్వామిత్రా! నాయాశరే కెత్తించితివిగాని నీవు
మాత్రము సఫలత గనగలిగితివా. మదనా నీయుప
దేశము పెడచెవినిడి యధికారమదమున చెడనడచిన
దాని ఫల మనుభవించి తీరవలసినదేనా.

అయ్యో! ఆ. వె. తగనిలోకనింద తనువువిస్తీర్ణమై
నిశిత వేదురందు నిలువనయ్యె
ఎదురెవ్వరిని అమాయికురాలి చెరచిన
తులువకిట్టిశిక్ష కలుగ దగదె.

అయ్యయ్యో!

స్త్రీపాత్రపలుజ్జగించి పశువృత్తికి లొంగి కులాంగనన్ సుధా
పాత్రగవాడు కొంటి శుచిపాత్రత గోల్పడినింద్య భాగినీ
నేత్రుడనైతి లోకములు నిత్యము నన్ గనినింద సేయవే
పాత్రకళంకపంక మెడ బాయదు నాకిక భద్రమున్నదే!

తెర పడును.

పంచమాంకము—రెండవ రంగము.

[మిథిలానగరవీధియందు త్రోవకు సమముగానిలచి]

అహల్య—నాథుడంగీకరించును. నన్ను మన్నించి ప్రేమించును సహజగంభీర రాగ మొలుకపలుకరించును. స్నేహామృత వృష్టితో కటాక్షించును. (క్షణమాలోచించి) నట్టి భ్రమ. లోకమనుగ్రహించదు - శాస్త్రములు సన్మతించినను - ఆచారములాదరించవు - (మరల నాలోచించి) ఆఁ - లోకులసమ్మతి నాకేల? నామనః ప్రభుని సమ్మతి, నానాథుని సమాధానము - క్షమించుమని వేడుకొందును. నారామదేవుని దివ్యవాణి వీణాఝుంకారమువలె మరల వినిపించుచున్నది. శ్వాసమున్నంత వరకును ఆశయుండును. సంశయమేల? పరమాత్మా - రామచంద్రా పాహిమాం - హరేరామ హరేరామ - రామరామ హరేహరే.

[బాటసారులు ప్రవేశం.]

1వ బాట—లే, లే, దోవకడ్డంగా లే.

అహల్య—(కొంతప్రక్కకు తొలగును.)

2వ బాట—మధ్యను నిలబడ్డావేమిటి అడ్డంగా....

అహల్య—(మరికొంత ప్రక్కకు తొలగును. ఒక ముసలిది పండ్లగంపతో ప్రవేశించి పరాకుగా అహల్యను తాకును. గంప తిరగబడిపోవును.)

ముసలిది—ఆశి - నీధీమామండా! శనిలాగు దాపురించావేమి కండ్లగుపడవ్వూ.

అహల్య—అమ్మా! కోపగించకు. నీపండ్లనుకూడదీసి మరల గంపలోపెట్టెదనులే - (పండ్లన్నియు గంపకెత్తి - ముసలియామె తలకెత్త యామెపోవును.)

మరియొక బాటసారి—ఇదే. దశరథమహారాజు ప్రక్కన గాత ముడు. అదుగో చూడరా. అటుచూస్తావేమి?

2 వ బాట—చూస్తా - దానికేమిగాని ముసలిది యుత్సవం చూస్తూ పరాకున పిచ్చిదానిపై బడి పండ్లగంప తిరగ బోసుకొని - కళ్ళగుకడవా నీకని యెదురుతిరిగి గద మాయించుతూంది. చూశావ్వా? (నిష్క్రమించును.)

అహల్య—నానాథుడట - నాభాగ్యము పండినది. రాముని వాక్యమే సత్యము - సత్యమే రామదేవుడు - రామ చంద్రా! నీమంగళవిధానమే సాగనిమ్ము.

[చిరంజీవి ప్రవేశించును.]

మందులమారి - మాయముండ - ప్రాణంవిసిగిపోతూంది - భూతాన్ని తరిమినట్లు రోజూ తరుముతూండడంతోటే సరిపోతూందినాపని - అబ్బ! యెన్నితిట్లుతిట్టినా - కొండమీాద వానపడినట్లు లెక్కచేయదుగదా - నవ్వు తుంది - గొడ్డునుబాదినట్లు బాదినా కంటిలోనీటి చుక్కనారాదు - బ్రతిమాలుతుంది. బెర్లిస్తుంది. (కూర్చుండి చెమటారకొంగుతో విసరుకొనుచు) హరి

భగవంతా! మగవాడిజన్మ యిలా తగులాటంతో నింత తగలబడిపోతే నింకెలాగు? ఈపీడ నన్నువదిలే ట్లులేదు - కికారణ్యములో నదిపేశాను - అంతులేని ఎడారులలో అగుపడకుండా అయిపులేకుండా తప్పు కున్నా - కైలాసపర్వతపుకోనలో తికమకలబెట్టి - ఎల్లాగో మరి కనబడకండా పరుగెత్తుకొచ్చా - చచ్చి సున్నమై - అతలాకుతలమై రోజుకుంటుగా శుభం గదా చూతామని వచ్చానే సరాసరి - తగనిరోగం తలకి చుట్టుకొనికూడాను - దిక్కుమాలిననిద్ర - సంధ్యవేళ చిన్నరోగమగతవలె కళ్ళకు కమ్మింది. సొన్నా యివలెనే సున్నితంగా పాట వినవచ్చింది. కలలోగాదుకాని మెలకువతో చూచుకొని కళ్ళుబ్బవిప్పారేనరికింకేముంది. మళ్ళీ ప్రత్యక్షం తలవద్ద వినరతూను - అదంతా సేవే నట. దీనిసేవ దిబ్బలుగాను - నాకు చేసే యీసేవ ఆదేవుడికే దగలబెట్టగూడదూ తరించిపోనుకదా. నన్నుపట్టుకు యేడవకపోతే (లేచి నిలువబడి) పోతా. లేకపోతే ముహూర్తం మిగిలిపోతుందోయేమో! నిజంగా యీప్రేమ - నోటిమాటలలోనూ - పుస్తకాల్లోను - కవులభావాలలోను వుండిపోయిందిగాని మనుష్యులకేపుట్టితే ప్రమాదమే - ప్రమాదమేకాదు ప్రళయమే - చచ్చినాపోదు. పోక పోవడమ్మంటుంటే పోవాల్సేపోతుంది. గురువుగారు చెప్పిన కలికాలమహత్తు

డొస్తుందోగాని మహాభాగుండును. మతిపోయేమజాలు ఆకర్షించే అందాలు - యదార్థమైనవాటికి అడ్డదిడ్డమైన వ్యాఖ్యానాలు వొస్తాయట. అప్పుడింక జన్మ పతివ్రతలుండరు. పుష్కరపతివ్రతలూ, మాసపతివ్రతలూ, పక్షపతివ్రతలూ, కడకు దినపతివ్రతలూ వుండినా అది ఫర్వాలేదు. (బతగొచ్చును - కాని నాకు పిచ్చెత్తిపోతున్నాది - వేగము పోతా. కాని మళ్ళీ వొస్తున్నాదేమిటి చెప్మా! ఏమో యెందుకేనా మంచిది పరిగెత్తిపోతా— (నిష్క్రమించును.

తెరపడును.

## పంచమాంకము—మూడవ రంగము.

జనకుని యాస్థానమంటపమున ఏకాంతముగ.]

గౌత—ఆహా! జన్మసార్థకమైనది. రాముడు నిజముగ జగదాశ్రీరాముడే.

సకలజగజ్జనజీవనదాయీ నిఖిలనయన సుఖదాయీ
పూర్ణ జలధరశ్యామలభాయీ రామమూర్తికె సుహాయీ
జ్ఞాననిధీజనకరాజపుత్రీ ఘనగతవిద్యుద్గాత్రీ
హాయిహాయి దాంపత్యవిధాయీ అదితీయ చతురాయీ.

ఉ. జీవులకెల్ల జీవమిడు జీవనదాత వినీల మేఘుడీ
జీవనదాతయున్ ప్రజకు జీవనమిచ్చుట తెల్పబోలునా
శ్రావణవారి వాహశుభ శ్యామలవర్ణము దుందుభిస్వనంబా
నవమోహనాంగునకు నాతియగున్ జనకాత్మ జాతయున్.

[అహల్య పాడుకొనుచు]

పలికింపవా హృదయవీణ
పతితదీనావనా నాప్రాణనాథా ॥పలికి॥
కలుషమై తృప్పుదిని కళమాసి శిథిలమై
కలగిపోయినస్థాయి మెలపుతో శృతిచేసి ॥పలికి॥
నీదయారసముతో పోద్రోలుమా మకిలి
రాదో నీసహజానురాగమున తొలిపలుకు ॥పలి॥
స్వరములొలికేవీణ పల్లవించు విపంచి
వంచింపబడి మూలద్రెస్సిపోయినతీవె ॥పలి॥
నీమృదుస్పర్శనల నిత్యసుధ చిలుకునిది
ఈమృషాజగతిలో నెల్లరికినింపుగా ॥పలి॥

గౌత—అహా! దౌర్భాగ్యజీవి! నాజీవితార్థము అసంపూర్ణమై పోయెనే యెంతటి దుర్గతి!

అహల్య—ప్రభూ దుర్గతిగాదు. ఉచితగతియే.

గౌత—ప్రేయసీ!

అహల్య—(ఉత్సాహముతో) ప్రేయసి! నాబ్రతునకింకను అంత మాత్రము మిగిలినది. నాజన్మకంతపాటి భాగ్యమా! ప్రభూక్షమించుము. అనర్హను. ఇంతవరకును మోసపోయితిని: సకలజగజ్జేగీయమాన నిర్మలప్రేమానంద

మయ దీపకళికను సేకరించుకొనలేకపోతిని. నీసత్వగుణ మహాత్మ్యమును తెలుసుకొనలేక పోయితిని. నీశాంతరస ప్రభావమును చూచుకొనలేకపోతిని. నీబ్రహ్మపదార్థ మును హితవు చేసుకొనలేకపోతిని. (పాదములపై బడి) ప్రభూ క్షమించుము. హరేరామ హరేరామ రామ రామ హరేహరే. ప్రభూ పోల్చితిరా?

[విశ్వామిత్రుడు ప్రవేశించును]

గౌత—ప్రాణేశ్వరీ పోల్చితిని.

అహల్య—లేదుప్రభూ పోల్చలేదు. పోల్చియేయున్న కోపా గ్నిలో మాడియేయుందును. శిక్షాస్ఫూర్తిలో శిథి లమై పోయియే యుందును. మధురప్రేమరసపూర్ణ ముగా నిట్లాశ్వాసించరు. అనురాగముతో ఆహ్వా నించరు.

గౌత—అహల్యా—

అహల్య—కాదు. అహల్యకాదు. మొండిమొరడు. సిగ్గుమా లినబండ. సర్వచైతన్యమును చచ్చిన చాపరాయి. పాషాణి అమృతమయుడైన ఆత్మనాథుని తెలుసుకొన లేని జ్ఞానశూన్యహీన కఠినపాషాణి. ప్రకృతి విరుద్ధ ముగకన్న కొడుకును కాముక వ్యాపార స్వేచ్ఛకు కడ ముట్టింప జంకెరుంగని హృదయపాషాణి. నాచరిత్రప్రతి పంక్తియు మహాహేయదుష్టనికృష్టపాపపుంజపదము

లతో పైశాచికపిపాసాపీడితరక్తరంజితాంకురములతో నరకఘట్టములతో నిండియున్నది. ఆలకింపుము.

గౌత—వలదహల్యా! వలదు. సర్వము నెరుంగుదును. అయ్యో పతితప్రియురాలా! నీవాడినమోము పీడసోకినతనువు పాతుకొనిపోయిన కనులు, మిగిలిన దుమ్ములును చాటు చునే యున్నవి.

అహల్య—ప్రభూ! తెలిసినది. నీక్షమాసంపత్తిలోని తీక్షణత నీకరుణామయ ప్రకృతిలోని కాఠిన్యముకంటె నిరంతర నరకయాతనయే నాకు మేలు. ఆనరకమే భరించగలను గాని యీకూలంకషానురాగము భరింపలేను. నాకు మరణమేమేలు. కాని ముందుగా క్షమింపుము. అయ్యో - అమృతభాండ మనుకొని దూకినదగ్నికుండ మైనది. కాకున్న శపించినిర్జింపవలసిన నన్ను నికృష్టను దయ జూచుటేమి! జ్ఞానశూన్యమగు నీపశువును ఆదరించుటేమి? నాకు వలదు. క్షమింపుము. మర ణింతును.

విశ్వా—క్షమయట! క్షమ. గౌతమా. ఇదుగో! ఏ స్త్రీసంఘ నియమము లుల్లంఘించి సంసారమూలమగు దాంపత్య లతను మొదలంట్ల తెగగోయునో. అట్టిది, తల్లియే యగుగాక. పిల్లయే కావచ్చును. శిక్షాస్మృతి ననుస రించి శిక్షింపబడవలసినదే. క్షమింపవీలులేదు.

గౌత—తాపసేంద్రా. తొందరపడకుము. మన మెవరమో మొదట యోచించుకొనుము. మానవులము. నిందా ప్రమాదనరకమున నిలచిన నరులము. ప్రాక్తనకర్మ వశమున కర్తవ్యమున మరచియో అనివార్య అసందర్భముల బలిమినో అపమార్గమునబడిన తెలివితక్కువ వారిని కనికరించి, బుద్ధిగరపి సన్మార్గమునకు తేవలయునేగాని శిక్షించుటకు మనమెవరము! న్యాయవిచారణకు మనమెంతటి విజ్ఞానులము? నిందానిరూపణకు మనదెంతటి నిర్దుష్టజీవిక? చూడు—

ఉ. ఖర్వము, గుర్వనంచనక కన్పడుసర్వము తానయౌచునీ
ఉర్విపయశ్శిఖానిలనభోంతరబాహ్య విరాట్స్వరూపుడై
సర్వభవాండ కర్మలకు సాక్షిగనుండుననంతశక్తి ఆ
సర్వనియంతకే తగు విచారణసేయగ శిక్షచేయగాన్.

అహల్యా—రమ్మ్య పొరపాటు నర్వులకును సహజమే.

గీ. వ్యష్టిరూపకమైన ప్రపంచమందు
శంకయును పొరపాటును సంభవంబు
వ్యష్టిసర్వసమిష్టి ఈశ్వరుడొకండె
పొరపడకయుండు సర్వసంపూర్ణుడగుట.

మరియు—

శా. దైవీసంపదయైన సత్వకరుణాతత్వంబె యావత్ జగ
జ్జీవానీక భవస్థితి ప్రళయములేయన్ సమర్థంబు ఆ

దేవాంశంబెత్తు మాగుణాఖ్య నరునిన్ దేవుంబొనర్చున్ క్షమా
భావంబున్ విడనాడియాసురత్రోవన్ బోవగా భద్రమే.

చెలా. నాహృదయపంజరమున భద్రతను గుర్తింపనేరక బాహ్య ప్రపంచానుభవము బావుకొందమని పసువెత్తిఱిని పలుగు పులుగు పడదన్నినది. హృదయమెంత చిదికిపోయినది!

క. అరలేని నాహృదయపం
జరమును నీకొరకెగా నొసంగితి నీ స
క్కరమాని పారినను నీ
కొరకైనదదెప్పుడైన కొనవచ్చుగదా.

తిరిగివచ్చితివి. పంజరము విరుగలేదు. అది నీయిరవే. తిరుగ యేలుకొనుము. కోలుకొనుము. నాకేల. యెల్లరిశాం తియే నాయాశయము.

విశ్వా—అబ్బా యింతటి నిర్లిప్తతయే. అసాధ్యము. అతి మానవత్వమే యిది.

మ. వశమే యీయతిలోకసాత్త్వికస్వభావం బెన్న మాబోంట్లకీ
దృశనిర్లిప్తత బొందరానియదె హేదివ్యప్రభావాఢ్య! జ్ఞాన
శశీ! మాయిహమెల్ల గ్రుంగె మునిమిన్నా నీకుజోహారు త్వా
దృశభూ దేవపదార్హతన్మరియు గాదే బ్రహ్మతేజంబిలన్.

జనకరాజేంద్రా! ఓడితిని—

గీ. సహజసత్త్వగుణప్రభాసహిత బ్రహ్మ
పదవిశిష్టతమాదృశవశముగాదు

నిజముతద్గారవార్తతనెగడ బ్రాహ్మ
ణులకెచెల్లును చెల్లదన్యులకు తలప.

అహల్య—దయాస్వరూపా - క్షమాసముధా - వైరాగ్యనిధీ
పరార్థభాండారమా - స్త్రీలు మాయామయులు, చం
చల ప్రకృతలు - అజ్ఞాన తమస్స్వభావలు - మిథ్యా
జాలములు. కేవలము పరమేశ్వరమూర్తులకంటిన
మాయాచ్ఛాదనములు యెంతక్రమ్ముకొన్నను, యెంత
విడంబించినను - యెంతపరివర్తనమందినను పురుషుని
యిచ్ఛావశలే. పురుషుడేనియంత. ఆతడే ప్రభువు.
స్త్రీనీడవలె నాతని ననుసరింపవలసిన దేగాని ప్రాధాన్యత
వహింపవలదు. ఇది సత్యము, ధృవము, నిశ్చయము.

జనకుడు—ఓహో! ధన్యోస్మి! స్వర్గపదవీభూతలమందే కను
చున్నాను. అమరత్వమెంత? అమరాధీశత్వమెంత?

మ. అమరాధీశపదమ్ము కేవలము తేజాభాసబింబంబె గా
తమజ్ఞానార్క సమీపమందు వెలుగొందన్ లేదు ఈధన్యుతో
సమకాలీనుడనై నసుకృతమె నాజన్మంబుకున్ చాలు మి
త్రమ [illegible]కాళిక! జన్మజన్మముల నిద్రాణంబువీడెన్ గదా!

విశ్వా—సీ. క్రూరుడై చోరుడై దారులంగొట్టు ప్యా
పారిసత్వగుణప్రచారకునిగ

చిరం—సౌశీల్యపదముకే జన్మవిరోధియా
జారిణిన్ శుద్ధసంసారిణినిగ

మాధురి—పతితపశ్చాత్తాప పరితప్తపాపినై
ఆదర్శవనితాశిఖామణినిగ

అహల్య—పరశువేదిస్పర్శ భాగ్యంబుననునోహ
మపరంజిగామార్పునంది వెలుగ

జనకుడు—కంటిమీధన్యు సంసర్గకతనభళిర
ప్రథితవిఖ్యాతమయ్యెనీ భరతమాత
ఘనుల సత్త్వగుణానంద ధనులనితము
కాంచి శుభసంపదలనొందుగాంచుగాత.

[అందరును కలసి—]

సత్త్వమూర్తి గౌతమముని చంద్రునకు జోహార్
సత్త్వరూపుడైన రామచంద్రునకు జోహార్
సత్త్వగుణులు భరతమాతృ సంతతికి జోహార్
సత్త్వసూత్రములగణించు జగములకు జోహార్.

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేనమార్గేణ మహీంమహీశాం
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాసమస్తాః సుఖినోభవంతు.

సంపూర్ణము.

---

మోడరన్ ప్రెస్, కలర్ ప్రింటర్స్ అండ్ బాక్సుమేకర్స్ రాజమండ్రి.

| | రు. | అ. |
|---|---|---|
| **నాటకములు.** | | |
| పాండవ జననము | 1 | 0 |
| పాండవరాజసూయము | 0 | 6 |
| పాండవప్రవాసము | 1 | 4 |
| పాండవఉద్యోగము | 1 | 12 |
| బైండు | 2 | 0 |
| పాండవవిజయము | 1 | 12 |
| పాండవఅశ్వమేధము | 1 | 8 |
| మృచ్ఛకటికము (గ్లేజు) | 2 | 0 |
| డిటో (బాదామి) | 1 | 12 |
| ఎడ్వర్డుపట్టాభిషేకము | 1 | 0 |
| పండితరాజము | 1 | 0 |
| వ్యాసవిజయము | 1 | 0 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 0 |
| సుకన్య | 0 | 6 |
| అనర్ఘనారదము | 0 | 8 |
| దంభవామనము | 0 | 8 |
| **ప్రబంధములు.** | | |
| శ్రవణానందము (గ్లేజు) | 1 | 12 |
| పాణిగృహీత | 1 | 4 |

| | రు. | అ. |
|---|---|---|
| ఏలామహాత్మ్యము | 0 | 8 |
| లక్షణాపరిణయము | 0 | 12 |
| శ్రీనివాసవిలాసము | 1 | 8 |
| బుద్ధచరిత్రము | 2 | 0 |
| గోదేవి | 1 | 0 |
| పతివ్రత | 1 | 0 |
| **లఘుకావ్యములు** | | |
| రసికానందము | 0 | 3 |
| శనిగ్రహము | 0 | 3 |
| శుకరంభాసంవాదము | 0 | 5 |
| భారతవిశేషములు | 0 | 5 |
| పురశ్చరణము | 0 | 5 |
| శృంఖలాస్వీకరణము | 0 | 6 |
| కాళికాస్తోత్రత్రిశతీమాల (సంస్కృతము) | 0 | 4 |
| కాళికాష్టకం ,, | 0 | 8 |
| కామేశ్వరీ శతకము | 0 | 4 |
| ఆరోగ్య కామేశ్వరి | 0 | 4 |
| ఆరోగ్య భాస్కర స్తవము | 0 | 4 |
| మృత్యుంజయ స్తవము | 0 | 4 |

| | గు. | అ. |
|---|---|---|
| వైరాగ్య శతకము | 0 | 4 |
| పాశుపతము | 0 | 4 |
| సౌభాగ్య కామేశ్వరి | 0 | 12 |
| కలగూరగంప | 1 | 0 |
| **వ చ న ము లు** | | |
| హర్ష చరిత్రము | 1 | 0 |
| విక్రమాంక దేవచరిత్రము | 1 | 4 |
| చంద్రప్రభ చరిత్రము | 1 | 4 |
| సారస్వత విమర్శలు | 1 | 4 |
| కాశీయాత్ర | 0 | 6 |
| పల్లెటూళ్ళ పట్టుదలలు | 0 | 6 |
| నానారాజ సందర్శనం | 3 | 0 |
| దేవీభాగవతం 1,2 భా॥ | 15 | 0 |
| కవిత్వమంటే ఏమిటి | 0 | 3 |
| జయంతి | 0 | 8 |

| | | గు. | అ. |
|---|---|---|---|
| గీతము | 1 భా॥ | 1 | 8 |
| ,, | 2 భా॥ | 1 | 0 |
| ,, | 3 భా॥ | 0 | 12 |
| ,, | 4 భా॥ | 0 | 12 |
| పూర్వహరిశ్చంద్రచరిత్ర | | 1 | 8 |
| శివస్తోత్రము | | 0 | 4 |
| షష్టిపూర్తి | | 0 | 4 |
| నమశ్శివాయస్తోత్రం | | 0 | 4 |
| విక్రమచెళ్ళసిళ్ళ | | 0 | 6 |
| శతావధానసారము | | 1 | 4 |
| లక్ష్మీనరసాపుర శతావధానం | | 0 | 4 |
| గుంటూరుసీమ | 1 భా॥ | 1 | 8 |
| ,, | 2 భా॥ | 1 | 8 |
| ,, | 3 భా॥ | 0 | 12 |

— వలయువారు —

# శ్రీ తిరుపతి వేంకటేశ్వర పబ్లికేషన్సు

ది వా క ర్ల బ్ర హ్మా నం దం

గవర్నమెంటు ట్రైనింగు కాలేజీ లైను, రా జ మం డ్రి.